# సామాన్య వృక్షాలు

డాక్టర్ హెచ్. సాంతపౌ

అనువాదం

వాకాటి పాండురంగారావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ప్రథమ ముద్రణ 1969 (శక 1891)
ద్వితీయ ముద్రణ 1991 (శక 1913)



*Original title in English* : Common Trees by H. Santapau
*Telugu Translation* : Samanya Vrukshalu

**రూ. 21.00**

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్కు,
కొత్త ఢిల్లీ-110 016 చే ప్రచురింపబడినది.

# ఉపోద్ఘాతం

బొంబాయినుండి వెలువడే "స్టేట్ ట్రాన్స్‌పోర్ట్ రివ్యూ" పత్రిక సంపాదకులు శ్రీ జె. జాన్, బొంబాయిలోని చెట్లను గురించి సామాన్య ప్రజల నిమిత్తం కొన్ని వ్యాసాలు వ్రాయమన్నారు. ఆ వ్యాసాలే ఇప్పు డీ పుస్తకరూపం ధరించాయి. ఈ వ్యాసాలలో మొదటిది 1958 మే నెల పత్రికలో అచ్చయింది; చిట్ట చివరిది 1960 జనవరిలో ప్రచురితమయింది. ఆ తర్వాత మరాటీభాషలో ఆ పత్రికను వెలువరించడానికని "స్టేట్ ట్రాన్స్‌పోర్ట్ రివ్యూ" పత్రిక ఆపివేయబడింది.

ఈ వ్యాసపరంపరలో మొదటి దానిని ప్రచురిస్తూ, ఆ పత్రికా సంపాదకుడు– "ఆకర్షణీయమైన పుష్పాలూ, ఆకులూ గల చెట్లనుగురించి, తీగలగురించి ఈ చిన్న చిన్న వ్యాసాలను సచిత్రంగా అప్పుడప్పుడు ప్రచురించాలని మాసంకల్పం. ఇట్టి చెట్లను, తీగలను ఇండ్ల ఆవరణలలో, వీధులలో ఇతోధికంగా పెంచడానికీ, మనరాష్ట్రప్రజలు రవాణా సిబ్బందీ ప్రకృతి సౌందర్యాన్నిచూచి మరింతగా ఆనందించడానికీ ఈ వ్యాసాలు దోహదం చేయగలవనే నమ్ముతున్నాము." —అని వ్రాశారు.

బొంబాయి ప్రాంతపు చెట్ల, తీగల గురించిన ఈ వ్యాసాలలో కొన్నిటిని వదలివేసి, మిగతా వాటిని కొద్ది మార్పులతో చేర్పులతో ఈ పుస్తకంలో ప్రచురించడమైనది. ఈ పుస్తకంలో కొన్ని సరిక్రొత్త వ్యాసాలను చేర్చడంకూడ జరిగింది. మనదేశపు ఇతర ప్రాంతాలలోను, నగరాలలోను వీధులవెంబడి నాటి పెంచే చెట్లను మాత్రమే ఎన్నుకుని, కేవలం ఇంటితోటలలోను అడవులలోను పెంచే చెట్లను వదలివేయడం జరిగింది.

ఈ పుస్తకం వృక్షశాస్త్రంగాని అటవీశాస్త్రంగాని వృత్తిగా గల వారి నిమిత్తం వ్రాసినది కాదు. ద్వీపకల్ప భారతదేశంలో సుపరిచితములైన కొన్ని వీధిప్రక్క చెట్లను గురించి సామాన్యప్రజలకు తెలియజేయాలన్నదే ఈ పుస్తకంయొక్క ఆశయం. అందుకనే ఈ పుస్తకంలో సాంకేతిక పదజాలాన్ని అతిపరిమితంగా

వాడాను; ఆ సాంకేతిక పదాలనయినా పూర్తిగా వివరించడానికి యత్నించాను. ఇహ, వ్యాసాలలో ప్రజలకు ఆసక్తిదాయకమైన వివరాలను మాత్రమే ఇచ్చాను. ఈ పుస్తకంలో చర్చించిన చెట్లలో చాలవరకు మనదేశంలో ఏదో ఒక భాగానికి చెందినవే; ఆ మిగిలిన కొన్ని పరదేశ చెట్లయినా, ఈ దేశమంతటా వ్యాప్తి చెంది, ఇక్కడి పరిస్థితులకు సర్దుకుని, ఇంచుమించుగా ఈదేశపు చెట్లవలె పరిగణించడానికి అర్హమైనవే.

మొదట బొంబాయిలోని ఆ పత్రిక నిమిత్తం బొంబాయి వాసుల నిమిత్తం వ్రాసినప్పుడు అక్కడివారికి ఆసక్తికరమైన సమాచారం ఇవ్వడం జరిగింది. ఈ పుస్తకంలో, హిమాలయ పర్వతాలకు దక్షిణంగా వున్న మనదేశంలో ఎక్కువ భాగానికి ఆసక్తిదాయకమైన విషయాల నిచ్చాను.

ఇందులో ఫలానా చెట్లగురించి వ్రాసి, ఫలానా చెట్లగురించి వ్రాయలేదేమి - అని వ్రాతప్రతిని చూచిన కొందరు మిత్రులు అడిగారు. ఇందులో చేర్చిన వాటి కన్న అందమైన చెట్లు కొన్ని వున్నాయి కదా—అని ప్రశ్నించారు. అట్లాంటి వారికి - నేను ఆయాచెట్లను ఎన్నుకోవడానికిగాని, కొన్నింటిని వదలివేయడానికి గాని ప్రత్యేకించి ఏమీ మూలసూత్రంగాని, సిద్ధాంతంగాని లేదనే సమాధానం చెప్పాలి. ఎన్నో ఏండ్లనుండి నేను భారతదేశమంతటా చెట్లను గమనిస్తూ పర్యటిస్తున్నాను. వాటిలో కొన్ని నన్నాకర్షించాయి. అవి ఈ పుస్తకంలో చోటు చేసుకున్నాయి. కాకపోతే కొందరు మిత్రులు 'ఇదిగో, ఈచెట్టు ఎంత అందంగా వుందో చూడండి—' అని నాకు చూపించిన సందర్భాలున్నాయి. అట్టి చెట్లూ ఇందులో వున్నాయి. మొత్తంమీద - హిమాలయాలకు దూరంగా ద్వీపకల్ప భారతంలోనూ, అస్సాములోని సుదూరప్రాంతాలలోను కనపడేవీ మన ప్రజలకు పరిచితమైనవీ - అయిన చెట్లను గురించి ఈ పుస్తకంలో వ్రాయడం జరిగింది.

ఇహ పోతే ఇందులోని చిత్రాల విషయం: ఒక్క 10-వ చిత్రం మినహా మిగతా వాటి రంగుల బ్లాకలను బొంబాయికి చెందిన ఎ. కె. గోహెల్ రచించిన వాటర్‌కలర్ చిత్రాలనుండి తయారు చేయించాము. గోహెల్ చిత్రరచనకు క్రొత్త ఢిల్లీలోని ''కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్, ఇండస్ట్రియల్ రీసర్చి'' వారు ఆర్థిక సహాయం అందించారు. ఒకప్పుడు పురందర్ వాసి, ప్రస్తుతం ఫిన్లండ్

వాసి అయిన ఆర్. ఎ. ఎక్లండ్ రచించిన చిత్ర మాధారంగా 10-వ చిత్రం తయారయింది. ఈ పుస్తకంలోని హాఫ్-టోన్ చిత్రాలన్నీ ఇ. బ్లాటర్ రచించిన "ది పామ్స్ ఆఫ్ బ్రిటిష్ ఇండియా అండ్ సిలన్" (ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ వారిచే ప్రచురితము.) అన్న పుస్తకం నుండి గ్రహించబడినాయి. i వ చిత్రమూ, ii (అ) చిత్రము మినహా మిగతా రేఖా చిత్రాలను ఈ పుస్తకం నిమిత్తం కలకత్తాలోని "బొటానికల్ సర్వే ఆఫ్ ఇండియా"కు చెందిన చిత్రకారుడు శ్రీ. డి. పి. దేబ్ వేశారు. ఈ రచయిత తీసిన ఫోటో ఆధారంగా ii (అ) చిత్రమూ, "బొటానికల్ సర్వే ఆఫ్ ఇండియా"కు చెందిన డాక్టర్ టి. ఏ. రావ్ తీసిన ఫోటో ఆధారంగా i వ చిత్రమూ తయారయినాయి. ఈ చిత్రకారులకూ, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ వారికీ నా ధన్యవాదా లర్పిస్తున్నాను.

మొదట "మీ చెట్లను తెలుసుకోండి" అన్న శీర్షికతో ప్రచురితమైన వ్యాసాలను ఈ పుస్తకంలో చేర్చడానికీ, వారి రంగుల బ్లాకుల నుపయోగించుకుని ఈ పుస్తకం ప్రచురణ ఖర్చులను తగ్గించడానికీ అనుమతించి సాయపడిన సంపాదకుడు శ్రీ జె. జాన్‌కూ రాష్ట్రీ రవాణా శాఖవారికీ నా కృతజ్ఞతలు. రేఖా చిత్రాల రచనలో తోడ్పడిన శ్రీ. కె. ఎస్. శ్రీనివాసన్ ("బొటానికల్ సర్వే ఆఫ్ ఇండియా"లో డిప్యూటీ డైరెక్టరు) కు నా కృతజ్ఞతాపూర్వక వందనా లర్పిస్తున్నాను.

హెచ్. సాంతపౌ

# వి ష య సూ చి క

పుటసంఖ్య

# చి త్ర సూ చి క

# 1. ఏనుగుచింత

*ADANSONIA DIGITATA* Linn.

(*Family :* Bombacaceae)

ఇంగ్లీషు పేర్లు : **BAOBAB ; MONKEY-BREAD TREE**

ఏనుగుచింతచెట్టుకే "బ్రహ్మమాలిక" అనీ "మగ్గిమావు" అనికూడా పేర్లున్నాయి.

ఏనుగుచింత ఆఫ్రికాఖండానికి చెందినది. ఎన్నోశతాబ్దాలక్రింద ముస్లిము వ్యాపారులు దీనిని ఆ ఖండంనుండి మనదేశానికి తెచ్చి, దేశమంతటా వ్యాప్తి చెందేటట్లు చేశారు. ఇప్పుడిది కలకత్తా, లక్నో, మద్రాసు మొదలగుచోట్ల కన పడుతుంది. దేశమంతటా వ్యాపించివున్నప్పటికీ ఏనుగుచింత పశ్చిమతీరప్రాంతాన అధికంగా కనపడుతుంది. కొన్నేళ్ళనుండీ నేను దీనిని బాస్సెయిన్‌లో చూస్తున్నాను. సాల్సెట్ ద్వీపంలోని కాండిటాలోని చర్చి సమీపంలోకూడా ఏనుగుచింతచెట్టును చూచాను. ఆ చర్చికి చెందిన మిషనరీలు దీనిని అక్కడ 16 వ శతాబ్దంలో నాటి నట్లు చెబుతారు. సాల్సెట్ ద్వీపమంతటా ఈ చెట్టు కనపడుతుంది. విక్టోరియా గార్డెన్స్ యొక్క ద్వారంవద్ద ఒక చక్కటి ఏనుగుచింతచెట్టు ద్వారపాలకుడిలా నిలబడివుంది.

## పేర్లు

దీని శాస్త్రీయనామము "అడనోనియా డిజిటాటా లిన్." 18-వ శతాబ్దానికి చెందిన ఫ్రెంచి వృక్షశాస్త్రవేత్త ఎం. అడన్సన్ నుండి "అడనోనియా" జన్మిం చింది; "డిజిటాటా" అంటే "వేళ్లవలె" వున్న ఆకులు గలదని భావం. దీనికి ఇంగ్లీషులో చాల పేర్లున్నాయి. ఒక్కొక్క పేరూ ఈ చెట్టుయొక్క ఒక్కొక్క గుణాన్ని సూచిస్తుంది. దీని పండుయొక్క ఆకార, పరిమాణాలబట్టి దీనికి "ఆఫ్రికన్ కేలబాష్" అన్న పేరు వచ్చింది. పండులోని గుజ్జునుబట్టి "క్రీమ్ ఆవ్ టార్టార్" చెట్టు అన్న పేరు కలిగింది. కోతులు దీని పండును ఇష్టంగా తింటాయి;

కాబట్టి దీనిని "మంకీ-బ్రెడ్ ట్రీ" అనికూడా పిలుస్తారు. ఆఫ్రికాలో దీనిని "బావ్‌బాబ్" అంటారు; అదేపేరు ఆంగ్లంలోకి వచ్చింది. మనదేశంలో ఏనుగు చింతకు - చోయారిచిచ్, గోరఖామ్లి, గోరఖ్‌చించ్ మున్నగు పేర్లున్నాయి.

## వర్ణన

దీని ఆకారం చాల వింతగా వుంటుంది. పూర్వం దీనిని ఇళ్లవద్ద, గుళ్లవద్ద పెంచేవారు. ఇందుకు దీనియొక్క వింతైన ఆకారము, దీని ఓషధి గుణాలూ కారణాలేమో ! కాని దీని మ్రాను చాల పెద్దగా పెరుగుతుంది. అందుచేత ఈనాటి నగరవీధులవెంబడి పెంచడానికిది తగినదికాదు. దీని చెక్క మెత్తగా వుంటుంది. దీని అడుగుమ్రాను చాల మొద్దుగా, ఇంకేచెట్టూ వుండనంత మొద్దుగా, వుంటుంది. ఇంతలావుగా వున్న అడుగుమ్రానునుండి హఠాత్తుగా పెద్దపెద్ద కొమ్మలు బయలుదేరుతాయి. ఏనుగుచింతయొక్క "స్వదేశ" మయిన ఆఫ్రికాలో



పటము 1. ఏనుగుచింత

కొన్నిచోట్ల దీని మ్రాను వ్యాసం 10 మీటర్లదాక వుంటుంది; చుట్టుకొలత 30 మీటర్లుంటుంది; అనగా ఆజానుబాహులయినవారు పదిహేనుమంది తమ చేతులను బార్ల జాపి నిల్చుంటే దీనిని చుట్టడానికి సరిపోతుందన్నమాట.

ఏనుగుచింతచెట్టు సుదీర్ఘమైన ఆయుస్సుకలది. తాను ఆఫ్రికాలో చూచిన ఒక ఏనుగుచింత వయసు 5000 సంవత్సరాలకన్న ఎక్కువే వుంటుందని అడన్సనే చెప్పాడు. 14, 15-వ శతాబ్దాలవారు తమ తమ పేర్లను బెరదుపై చెక్కిన చెట్లెన్నింటినో తాను ఆఫ్రికాలో చూచినట్లు 18-వ శతాబ్దంలో అడన్సన్ అన్నాడు. అయినప్పటికీ వీటిని ప్రపంచంలో కెల్లా అతి వృద్ధ వృక్షాలనడానికి వీలులేదు. ఆ గౌరవం కేలిఫోర్నియాలోని పెద్దపెద్ద 'రెడ్ వుడ్' చెట్లకు, అమెరికా పశ్చిమప్రాంతాలలోని 'కోనిఫెరస్' (దేవదారుజాతి) చెట్లకు దక్కుతుంది.

ఏనుగుచింత సిటారుగా, 20 మీటర్లకు మించకుండా పెరుగుతుంది. దీనిబెరదు నున్నగా ఉండాలి; కాని సాధారణంగా అట్లా కనపడదు. దీని ఆకులు బూరుగ ఆకులవలెనే వుంటాయి. దీని ఆకు తొడిమె పొడవుగా మందంగా వుంటుంది. తొడిమె చివర ఒక్క బిందువునుండే 5-7 చిన్న ఆకులు బయలుదేరుతాయి. విచ్చుకోవడానికి ముందు 10-12 సెంటిమీటర్ల పొడవు, విచ్చుకున్నాక 15 సెంటిమీటర్ల పొడవూవున్న దీని పూలు చూపరుల దృష్టి నిట్టే ఆకర్షిస్తాయి. దీని పూలు తెల్లగా, పువ్వొడితిత్తులవద్ద కాస్త ధూమ్రవర్ణంగా వుంటాయి. దీని కేసరములు దట్టగా వుంటాయి. పూరేకులు విచ్చుకుని, క్రమంగా వెనక్కు వంగినాక ఈ కేసరముల కట్ట స్పష్టంగా కనపడుతుంది. దీనిపండు 20-30 సెం.మీ. పొడవున, బావుపాటి తొడిమె చివర పొట్ల బీర కాయలవలె వ్రేలాడుతుంటుంది. ఈ పండు కోడిగ్రుడ్డు ఆకారంలో, లేత గోధుమవర్ణంలో వుంటుంది. దీని పెంకు గట్టిగా వుంటుంది. లోపలిగుజ్జు పిండిపిండిగా వుంటుంది. ఈ గుజ్జులో ఎన్నో గింజలుంటాయి. దీనిగుజ్జును మనుష్యులు తింటారు. ఇది పుల్లగా ఘాటుగా, ఎండాకాలంలో తినడానికి పసందుగా వుంటుందని అంటారు. కాని నా మట్టుకు నేను తిని చూడగా ఇది ఎట్టిరుచీ లేనిదిగా అనిపించింది. అయితే కోతులుమాత్రం దీనిని అతిఇష్టంగా తింటాయి. కనుకనే దీనిని ఆఫ్రికాలో "మంకీ-బ్రెడ్ ట్రీ" అంటారు.

## గుణగణాలు, ఉపయోగాలు

బీళ్లల్లో, మైదానాలలో నాటితే ఏనుగుచింత చూడ చక్కని పువ్వులతో తళతళ లాడుతుంటుంది. కాని ఇంతకుముందు చెప్పినట్లు దీని అడుగు[?]మాను విపరీతంగా లావుగా పెరుగుతుంది గనుక వీధులవెంబడి పెంచడాని కిది యోగ్యమైనది కాదు. దీనిచెక్క మరీ మెత్తగా వుంటుంది కనుక వడ్రంగపుపని కిది పనికిరాదు. అగ్గి పుల్లలు తయారు చేయడానికి చెక్క అనువైనదేకాని, ఆ పరిశ్రమ కవసర మైనంతగా ఈ చెట్టు మనదేశంలో పెరగడంలేదు.

అయితే ఆఫ్రికాలోని చెట్టుచేమలగురించి వ్రాసినవారు మాత్రం ఈ చెట్టు ఎన్నో విధాలుగా ఉపయోగపడుతుందని అంటారు. ఆఫ్రికన్ చెట్లలో అత్యంత ఉపయోగకరమైన వాటిలో ఇది ఒకటనీ, దీని ప్రతిభాగమూ కూడా ఏదో విధంగా పనికివస్తుందనీ వారు వర్ణిస్తారు. దీని బెరడులోని గట్టిపీచుతో త్రాళ్లను, సంచు లను, బట్టలను తయారుచేస్తారు. ఈ పీచుతో తయారయిన గట్టి కాగితం కరెన్సీ నోట్లను ముద్రించడానికి పనికివస్తుంది. దీని పండుగుజ్జు టార్టార్ క్రీమ్[1]వలె వుంటుంది. జ్వరాలలో వేడి తగ్గించడానికి మందుగా వాడుతారు. బంక విరేచనాల వంటి జీర్ణసంబంధమైన వ్యాధులలో కూడా దీనిని మందుగా పుచ్చుకుంటారు. ఈగుజ్జుతో ఆఫ్రికాలోనూ, అక్కడక్కడ మనదేశంలోను చల్లటి, రుచికరమైన పానీయాన్ని తయారుచేస్తారు. ఇంతకుమునుపు ఈ చెట్టుబెరడు యూరపుకు ఎగు మతి అయేది. ఇప్పటికీ ఈ బెరడును ఆఫ్రికాలో మలేరియా జ్వరానికి మందుగా క్వినైన్‌స్థానే వాడుతారు. ఏనుగుచింతయొక్క ఎండుటాకులు స్వేదవృద్ధి కల్గిస్తాయి. కిడ్నీ (మూత్రపిండ) సంబంధమైన వ్యాధుల నివారణకు పనికివస్తాయి-అంటారు. దీని బెరడును చీల్చగా కారే బంక, ముఖ్యంగా ఒంటెలు మొదలైన పెంపుడు జంతువులకు కలిగే చీముపుండ్లను శుభ్రపరుస్తుంది. ఈ చెట్టులో తొఱ్ఱలు చేసి, ఆ తొఱ్ఱలలో మనుష్యులు నివసిస్తారు. భూగర్భంలోనుండి త్రవ్వి తీసిన ఒక ఏనుగుచింతతొఱ్ఱ ముప్పైమంది పడుకోతగినంత విశాలంగా వుంది అని లివింగ్‌స్టన్ వర్ణించాడు. దీని పండ్లను కాల్చగా వచ్చిన బూడిదను, నూనెలో

---

[1] టార్టార్ క్రీమ్ అనగా పొటాసియం హైడ్రోజెన్ టార్టేట్. ఇది తెల్లగా వుంటుంది. ద్రాక్ష సారాయి బట్టీలలో విడివడే టార్టార్ (అర్‌గాల్) నుండి లభిస్తుంది—అను



పటము. 2. ఉద్రగణవ

(చూడు : పుట 5)



పటము. ౫. కాంచనము

(చూడు : పుట 18)

నానబెట్టిన దీని బెరడును, ఆఫ్రికాలో కొన్ని తెగలవారు ఒళ్లు రుద్దుకోవడానికి వాడుతారు.

ఈ చెట్టుయొక్క వికృతరూపం చూచి కాలోలు జనులు దీనినిగురించి ఎన్నో అభూతకల్పనలను సృష్టించుకున్నారు. ఒక్కొక్కప్పుడు ఆకులులేని ఈ చెట్టు యొక్క మ్రాను 'డాంటే' కవి తన "ఇన్‌ఫెర్నో" కావ్యంలో వర్ణించిన భూతాలలో ఒకదానివలె వుండడం నిజమే। ఆఫ్రికాలోని కొన్ని భాగాలలో తాంత్రికుల ప్రముఖుల శవాలను ఈ చెట్ల తొర్రలలో ప్రేలాడదీస్తారు; వాటిలో శవాలు కుళ్లకుండా మందు పూసినట్లుగా ఎండిపోతాయి. ఈ కారణంవలనకూడా ఈ చెట్టంటే భయమూ అనుమానమూ కలిగాయేమో।

## 2. రుద్రగణప

*ADINA CORDIFOLIA* Hook.

[*Family* · Rubiaceae]

ఇంగ్లీషు పేరు : **KADAM**

రుద్రగణపనే—కంబ, కమడ, పచ్చగణప, పచ్చబొట్టుగ, పసుపుకైమి, దాదుగ, బందారు, బందిరి, బందెర, బంజేరు—అనికూడా పిలుస్తారు.

రుద్రగణప నగరాలలో ఎక్కువగా కానరాదు. కాని ఇది నగరవీధులలో పెంచడానికి అర్హమైనది. దీని ఇంగ్లీషు పేరులోని "అడినా" అన్నది "అడినోస్" అన్న గ్రీకుపదంలోనుండి వచ్చింది; "అడినోస్" అనగా "గుమికూడిన" అని అర్థం; రుద్రగణపయొక్క పువ్వులు గుమికూడి, గుంపులుగా వుంటాయి గనుక "అడినోస్" అన్నారు. దీని హృదయాకారపు ఆకులనుబట్టి "కార్డిఫోలియా" అన్నపదం వచ్చింది.

## వ్యాప్తి

రుద్రగణప మనదేశపు చెట్టు. ఆకులురాల్చే చెట్లున్న అడవులన్నిట రుద్రగణప కనపడుతుంది. బొంబాయి అడవులలో ఇది బాగా పెరుగుతుంది. అక్కడ దీనిని "టేకు" తర్వాత ఎన్నదగిన అయిదు ముఖ్యమైన కలపరకాలలో ఒకటిగా పరిగణిస్తారు.

వాఘైనుండి నాసిక్ వెళ్లేదారిలో డాంగ్స్ అడవిలో నేను ఒక పెద్ద రుద్రగణప చెట్టును చూచాను. ఆచెట్టుకు 1955 లో తగిలించిన ఒక పలకమీద ఆచెట్టు పొడవు 50 మీటర్లనీ, చుట్టుకొలత 5·5 మీటర్లనీ వ్రాసివుంది. డాంగ్స్ జిల్లా మొత్తంమీద ఇంతపెద్ద రుద్రగణప చెట్టు లేదని పేర్కొనబడింది.

## వర్ణన

ఆకులు రాల్చేటువంటి ఈ చెట్టు అన్నీ సరిగా అమరితే 30 మీటర్ల ఎత్తుదాక పెరుగుతుంది; కాని సాధారణంగా 14-20 మీటర్ల ఎత్తువరకు పెరుగుతుంటుంది. దీనిఆకులు ఇంచుమించుగా వర్తులంగా, 25 సెంటిమీటర్లు లేక అంతకన్న ఎక్కువ వెడల్పున వుంటాయి. ఆకుమొదలు గుండెఆకారంలో వుంటుంది; చివరను కొనదేలి వుంటుంది. లేతదశలో నూగుకలిగి, ఆకుపచ్చగా, కొద్దిగా ఎర్రగావున్న అంచుతో వుంటుంది. ఆకు మధ్యఈనె లావుగా, మొదలునుండి కొనదాక వుంటుంది. ఈ మధ్యఈనెనుండి పిల్లఈనెలు అయిదారు జతలు బయలుదేరి ఆకు అంచున కలుసుకుంటాయి. ఆకులు ఎదురెదురుగా జతలు జతలుగా వృంత పుచ్ఛములు కలిగివుంటాయి. ఈ పుచ్ఛములు 2·5 సెం.మీ. పొడవున వుండి, లేలేత ఆకులను, కాండపు అగ్రాన్ని రక్షిస్తాయి. ఈ పుచ్ఛములు పడిపోయిన తర్వాత మచ్చలవంటి గీతలు రెండు కొమ్మపొడవులో సగం మేరకు చుట్టుకొని వుంటాయి. ఆకుతొడిమెలు 5-10 సెంటిమీటర్ల పొడవున వుంటాయి. పువ్వులు విడివిడిగానయితే మరీ చిన్నవిగా వుంటాయి. కాని ఇవి 2-3 సెంటి మీటర్ల పొడవుగల బంతులుగా వస్తాయి. చిన్నపువ్వులు, పసుపురంగులో చివరల కొద్దిగా లేతగులాబిరంగుతో వుంటాయి. ఈ పువ్వులు విచ్చుకోగానే వాటిలోని కేసరాలే ప్రధానంగా కనబడతాయి. ఈ కేసరాలన్నీకలిసి ఆ పువ్వులబంతిచుట్టు

ఒక వెలుగు వలయంగా కనబడతాయి. రుద్రగణప పండ్లుకూడా చిన్నవిగా, నల్లవిగా వుంటాయి.

ఈచెట్టు ఫిబ్రవరిలో ఆకులను రాల్చుతుంది. అప్పటినుండి మే-జూన్ దాక ఆకులు లేకుండానే వుంటుంది. ఆ సమయంలో మొగ్గలను కప్పివున్న వృంత పృచ్ఛాలు కొట్టవచ్చినట్లు కనపడతాయి. జూన్-ఆగస్టులమధ్య పూలబంతులు కనుల కింపుగా వుంటాయి. ఆ మరుసంవత్సరపు జూన్‌నెల మొదట్లో పండ్లురాలిపోతే, నల్లటి పండ్లతొడిమెలుమాత్రం నిలిచివుంటాయి. ఇవి 12 మిల్లిమీటర్ల వెడల్పున వుంటాయి. వర్షాలు రాగానే ఈ తొడిమెలు రాలిపోయి క్రొత్త పూబంతులు ఏర్పడడానికి చోటువిస్తాయి.

## ఉపయోగములు

ఈ చెట్టుబెరడును 'యాంటిసెప్టిక్' మందుగాను, జ్వరాలలో మందుగాను వాడుతారు. ఈచెట్టుయొక్క రసం పుండ్లలోని పురుగులను చంపుతుం దంటారు. ఈ చెట్టుబెరడును తీయగా కారిన బంకవంటి పదార్థాన్ని ఈ విధంగా మందుగా ఉపయోగిస్తారు. మరీ అంత మెత్తకాని, మరీ అంత గట్టికాని రుద్రగణప కలపకు మంచి గిరాకీ వుంది. మనకు చల్లని నీడ కావలసిన ఏప్రిలు-మే మాసాలలో ఆకులు లేకుండా వుంటుంది గనుక ఇది వీధిప్రక్కల నాటడానికి అనువైనది కాదు. కాని ఆకులతో వుండగా ఇది చూడ ముచ్చటగా వుంటుంది. శీతకాలమంతటా రుద్రగణపవృక్షం నయనానందకరంగా వుంటుంది. ఏపుగా పెరిగే ఈ చెట్టు చక్కని దనే చెప్పాలి.

## పెంపకము

వర్షాలు రాగానే, అంతకుముందే రాలి నేలలోపల దాగిన విత్తనాలు అంకు రిస్తాయి. కాని ఆ పిల్లమొక్కలు చిన్నవిగా, అతిబలహీనంగా వుంటాయి; వర్షాని కివి కొట్టుకుపోయినా పోవచ్చును. అన్ని పరిస్థితులూ అనుకూలిస్తే ఈ మొక్కలు చాల నిదానంగా, మొదటి ఋతువులో 10-12 సెంటిమీటర్ల ఎత్తుకే పెగురుతాయి. ఈ మొదటిదశలో ఈ మొక్క ఎక్కువ వెలుతురుకుగాని బెట్టకుగాని తట్టుకో

లేదు. అయితే మొక్క వేళ్లూని ఎదిగాక దీనికి వెలుతురు అధికంగా కావాలి. నీటి సౌకర్యంవుండి, నీరు బాగా వదిపే నేలలో రుద్రగణప బాగా పెరుగుతుంది.

మడులలోగాని, కుండీలలోగాని రుద్రగణపమొక్కలను పెంచవచ్చును. బాగా జల్లించిన మట్టిలో ఎక్కువగా ఇసుక కలిపి దానిలో ఈ మొక్కలను పెంచ వచ్చును. ఈ విధంగా పెంచేమొక్కలను వర్షంనుండి రక్షించాలి. ఈమొక్కలను నేలలోకి అతిజాగ్రత్తగా నాటాలి. మొక్కలను, వాటివేళ్ల చుట్టువున్న మట్టితో సహా తీసి నాటడం మంచిది. అడవిలో ఈ చెట్లు తిన్నగా, నిటారుగా పెరుగుతుంది; అపుడపుడు దీని అడుగుమ్రాను వంకరటింకరగా, వికృతంగా కూడా పెరగడం కద్దు. ఏటవాలుప్రదేశాలలో గుంపులు గుంపులుగా పెంచదానికిది చాల యోగ్య మైనది. తోపుగాగాని, గుంపుగాగాని పెంచితే, రుద్రగణపచెట్లు చూపరుల దృష్టికి ఆహ్లాదం కల్గిస్తూ, చిన్నచిన్న పక్షులకు ఆశ్రయమిస్తూ వుంటాయి.

## 3. పెద్దమాను

### *AILANTHUS EXCELSA* Roxb.

(*Family* : Simaroubaceae)

ఆంగ్లపు పేరు : **THE TREE OF HEAVEN**

పెద్దమానుకే పెద్ద, పెయ్యవేప, — పెద్దమందుపేడు — అన్న నామాంతరా లున్నాయి.

దక్షిణ భారతదేశమంతటా, ముఖ్యంగా దక్కన్ ప్రాంతంలో, గుజరాత్‌లో, బీహార్‌లో పెద్దమాను కనపడుతుంది. ఇది మనదేశపు చెట్టు. దీనిని తాను తూర్పు భారతదేశమందు సర్కారు జిల్లాలలో చూచినట్లుగా విలియం రాక్స్‌బర్గ్ 1795 లో వర్ణించాడు. ఇది అతిత్వరితంగా పెరుగుతుంది. ఆ కారణంచేత దీనిని దేశం

లోని బెట్టప్రాంతాలలో పెంచుతున్నారు. పెద్దమాను ఆస్ట్రేలియాకు చెందినదని కూడా అంటారు.

'ఏయిలాంతస్' అన్న లాటిన్‌పదం మలక్కాస్‌లోని స్థానికభాషాపదమైన 'ఏయిలాంటో' నుండి వచ్చింది.

## వర్ణన

ఆకులు రాల్చేటి పెద్దమాను త్వరితంగా 25 మీటర్ల ఎత్తుదాక పెరుగుతుంది. దీనిబెరడు తెల్లగా వుంటుంది. ఆకులు 25-75 సెంటిమీటర్ల పొడవున పక్షాకారంగా వుంటాయి. దీని ఉపపత్రాలు ఏకాంతర క్రమముగా (మరచుట్టు ప్రసారముతో) గాని అర్ధాభిముఖ ప్రసారముతోగాని వుంటాయి. ఈ ఉపపత్రాలు 8-12 జతలుగా వివిధ పరిమాణాలలో అక్రమమైన గరితో వుంటాయి. ఉపపత్రం మొదలువద్ద ఇటూ అటూ అసమానంగా వుంటుంది. పూలు 8 మిల్లిమీటర్ల వెడల్పున, రెమ్మ గుత్తులుగా, పసుపురంగులో వుంటాయి. దీనికాయ చదునుగా సన్నగా వుంటుంది. ఇటువంటికాయను 'ఛదఫలము' లేక 'సమారా' అంటారు. ఈకాయ 4-6 సెంటి మీటర్ల పొడవున, 1-1·5 సెంటిమీటర్ల వెడల్పున బల్లెపు ఆకారంలో వుంటుంది. దీని రెండుకొనలూ మొనదేలి వుంటాయి. దీనిలో ఒకే ఒక గింజ వుంటుంది.

## ఉపయోగములు

సారం తక్కువగా గల నేలలలోను, ఉష్ణప్రాంతాలలోను పెద్దమాను బాగా పెరుగుతుంది. దీని చెక్క తేలికగా, లేతరంగులో వుంటుంది. ఈచెట్లు విరివిగా పెరిగేచోట్ల దీనిచెక్కతో ప్యాకింగ్ పెట్టెలనూ, చేపలుపట్టే పడవలనూ తయారు చేస్తారు. కత్తులపిడులు తయారుచేయడానికి ఈ చెక్క వాడుతారని 1839 లో గ్రాహమ్ వ్రాశాడు. పెద్దమాను బెరడు జ్వరానికి మందుగాను, టానిక్‌గాను వాడుతారు.

## ఇతర ఏయిలాంతస్ జాతులు

*Ailanthus Triphysa* Alst. (Ailanthus Malabarica DC.) అన్న శాస్త్రీయనామముగల పెద్దమానుపట్టచెట్టు (మద్దిపాలు) మనదేశంలో పడమటికనుమల ప్రాంతంలోను, దక్షిణాన సింహళములోను, తూర్పున




పటము 3. పెద్దమాను

బర్మాలోను కానవస్తుంది. ఉత్తరకవరాలో 30 మీటర్ల ఎత్తువరకు పెరిగిన చెట్లను నేను చూచాను. దీనిబెరడును కోస్తే ఒకవిధమైన బంక వస్తుంది. ఆ బంకను అగరువత్తుల తయారీలోను. బంకవిరేచనాలకు మందుగాను వాడుతారు.

*Ailanthus Glandulosa* అన్న పెద్దమాను చైనా, మలక్కా-స్‌లకు చెందినది. దీనిని ఉత్తరభారతదేశాన పీద నివ్వడానికై నాటుతారు. ఈ చెట్టుయొక్క వివిధ భాగాలు ఔషధాలుగా ఉపయోగపడుతాయి.

## 4. ఏడాకుల పాల

*ALSTONIA SCHOLARIS* R. Br.

(*Family*: Apocynaceae)

ఇంగ్లీషు పేర్లు: **DEVIL'S TREE; DITA BARK TREE**

ఏడాకులపొన్న, ఏడాకుల అరటి, సప్తపర్ణి, ఎలారము, దేవసురిప్ప, పాలైఫి, పాలగరుడ—ఇవన్నీకూడా ఏడాకుల పాలచెట్టుకు మారుపేర్లు.

ఏడాకుల పాల—అన్నది ఎంత అందమైన పేరో ఆచెట్టూ అంత అందమైనది. సతతహరితమైన ఈ చెట్టు ద్వీపకల్ప భారతదేశంలో, ముఖ్యంగా తూర్పు, పడమటి కనుమలలోని ఆర్ద్రప్రాంతాలలో ఎక్కువగా కనపడుతుంది. సముద్రమట్టంనుండి వెయ్యి మీటర్ల ఎత్తుదాక ఇది పెరుగుతుంది. ఏడాకులపాల ప్రాగ్దిశను జావా, ఆస్ట్రేలియాలదాక వ్యాప్తిచెందింది.

### పేర్లు

'ఆల్‌స్టోనియా' అన్న గణనామము ఆచార్య సి. ఆల్‌స్టన్ అన్న సుప్రసిద్ధ వృక్షశాస్త్రవేత్త (ఎడిన్‌బరో, 1685-1760) స్మృత్యర్థం నిర్ణయించబడింది.




పటము 4. ఏడాకులపాల

పూర్వపురోజులలో బడిపిల్లల పలకల నిమిత్తం దీని కలపను వాడినందున 'స్కాలారిస్' (స్కాలర్ = విద్యార్థి) అన్న పేరు వచ్చింది. మరాటీభాషలో దీని పేరయిన ''సాత్విన్'' (సాత్ = ఏడు) అన్నది కూడా దీని ప్రతికణుపువద్ద ఒక్క సారిగా వచ్చే ఏడాకుల వలన వచ్చినదే.

## వర్ణన

పొడవుగా అందంగావుండే ఈ చెట్టుబెరడు బూడిదరంగులో, గరుకుగా వుంటుంది. దీని కొమ్మలు ఛత్రాకారంగా వుంటాయి. అనగా—అనేకశాఖలు ప్రధానకాండంనుండి అదేఎత్తున—గొడుగులోపలి కమ్మీలవలె—బయలుదేరు తాయి. ఒక్కొక్క 'ఛత్రం' లోనూ 4-7 ఆకులుంటాయి. ఏడాకుల పాలాకులు ఆకారంలో మామిడాకులను పోలివుంటాయి. తోలువలె దళసరిగా వుండే ఈ ఆకులు పైభాగాన ముదురు ఆకుపచ్చగాను, క్రిందిభాగాన తెల్లగా మెరుస్తూను వుంటాయి. చివరికొమ్మలమీద సన్నటి పొడుగాటి కాడలకొసను గుత్తులు గుత్తులుగా పువ్వులు పూస్తాయి. ఈ పువ్వులు తెల్లగా లేక ఆకుపచ్చ కలిసిన తెలుపుగా సువాసనకలిగి వుంటాయి. దీనిది ఏక విదారణఫలము (అనగా ఒకవైపు మాత్రమే పగిలేది). ఈ పండు 30-50 సెంటిమీటర్ల పొడవు, 3-4 మిల్లిమీటర్ల మందము కలిగివుంటుంది. ఈపండ్లు జతలు జతలుగా వుంటాయి. ఈపండ్లు ఎక్కువగా వుండి చెట్టుయొక్క ఆకారాన్నే మార్చివేస్తాయి.

ఒక క్రమమైన పద్ధతిలో ఏర్పడిన కొమ్మలు, చెట్టునిండా ఆవరించిన పూల రాసులు, పండ్లగుత్తులు—ఇవి ఈ ఏడాకుల పాలచెట్టుకొక ప్రత్యేకమైన శోభ నిస్తాయి. ఫలభరితమైన ఈచెట్టు నాకెప్పుడూ—తన సుదీర్ఘ కేశరాశిని విరియ బోసుకున్న కోమలిని గుర్తుచేస్తాయి.

## ఉపయోగములు

ఈ చెట్టుయొక్క కలప మరీమెత్తగా వుంటుంది గనుక ప్యాకింగ్ పెట్టెలు, బ్లాక్‌బోర్డులు వంటివి తయారుచేయడానికే తప్ప అంతకన్న గట్టివాటికి పనికిరాదు. దీని బెరడును ''దీతా బెరడు'' అంటారు. జ్వరాలలో రక్త విరేచనాలలో దీనిని మందుగా ఇస్తారు. ఈబెరడు చేదుగా వుంటుంది. పశ్చిమ భారతదేశమందు

ఈచెట్టు దెయ్యాలు భూతాలవంటి వాటి నివాసమని నమ్ముతారు. ఆ ప్రాంతపు కొన్ని తెగంవారు ఈ చెట్టుపీడను కూర్చోవడానికిగాని నడవడానికిగాని అంకరం నే నెరుగుదును. కర్మకాలి ఈ చెట్టుక్రిందగాని ఎవరన్నా కునుకు తీశారా, అది ఆచెట్టుమీది దుష్టశక్తులు అతడిని చంపుతా యనడానికి సూచకము—అని వారు నమ్ముతారు. అయితే 'అంతా మనమేలుకే' అన్నట్లుగా ఈ భయం కారణంగా ఈ చెట్టుజోలికి ఎవరూ రారు. తత్ఫలితంగా ఈ అందమైనచెట్టు ఎట్టి విధ్వంసానికీ గురికాకుండా చూడ ముచ్చటగా పెరుగుతుంది.

## 5. పనస

*ARTOCARPUS HETEROPHYLLUS* Lamk.

(*Family :* Moraceae)

*ఇంగ్లీషుపేరు :* **JACK - FRUIT TREE**

పనస నెరగనివారు మనదేశంలో అరుదుగా ఉంటారు. అనాదినుండి భారతదేశ చరిత్రలో పనస చోటు చేసుకునివుంది. క్రీ. పూ. 300 సం॥ ప్రాంతంలో గ్రీకు చరిత్రకారుడు థియోఫ్రాస్టస్ "ఇక్కడ మరొక పెద్దచెట్టుంది. దానిపండ్లు పెద్దగా అతి తీయగా వుంటాయి. వాటి నిక్కడ సాధువులు, ఆచార్యులూ ఆహారంగా పుచ్చుకుంటారు." అని వ్రాశాడు.

### పేరు

పనసయొక్క సరయిన శాస్త్రీయనామము - 'అర్టోకార్పస్ హెటిరోఫైలస్ - లామ్క్' కాగా మన వైజ్ఞానిక సాహిత్యంలో దీనిని తప్పుగా "అర్టోకార్పస్ ఇంటిగ్రిఫోలియా - " అంటున్నారు. 'అర్టోకార్పస్' అన్న గణనామమునకు ఆధారము

లైన రెండు గ్రీకుపదాలకు 'బ్రెడ్ ఫ్రూట్' అని అర్థం. కాని అసలు 'బ్రెడ్ ఫ్రూట్' (సదా పనస) చెట్టు అని పిలువబడే దాని శాస్త్రీయనామము - 'అర్టోకార్పస్ కమ్యూనిస్ ఫార్ సెట్ (లేక) అ. ఇన్‌సిసస్ లిన్. ఎఫ్.' ఈ జాతి న్యూ గినీ లోను మైక్రోనీసియాలోను కనపడుతుంది.

## వర్ణన

సతతహరితమైన ఈ చెట్టు మధ్య పరిమాణంలో వుంటుంది. శీతాకాలంలో కొద్దిగా ఆకులు రాలుతాయిగాని ఎప్పుడూకూడా పనసచెట్టు ఆకులులేకుండా వుండడ మంటూ జరగదు. దీని ఆకులు కోడిగ్రుడ్డు ఆకారంలో, 10-20 సెంటిమీటర్ల పొడవున, కొనదేలి వుంటాయి. ఆకు మొదలు సన్నగా వుంటుంది. తోలువలె దళసరిగా వున్నప్పటికీ ఆకు నున్నగానే వుంటుంది. పైన ముదురు ఆకుపచ్చగా మెరుస్తుంటుంది. క్రింద కాస్త పాలినట్లు, గరుకుగా వుంటుంది. ఆకు మొదలు నుండి కొనదాక వున్న మధ్య ఈనెలనుండి 7-10 జతల ప్రక్క ఈనెలు వుంటాయి. కొమ్మలచివరగాని, కాండముమీద కొమ్మలమీదగాని ఆకులకు దూరంగా పూలు పూస్తాయి. ఆడపూలు, మగపూలు వివిధమంజరులలో పూస్తాయి. మగపువ్వుల మంజరి ఇంచుమించు గొట్టపు ఆకారంతో 2-10 సెంటిమీటర్ల పొడవున, మన బొటనవేలివలె వుంటుంది. ఒక్కొక్క మగపువ్వుయొక్క ఆకర్షక పత్రావళి 1-2 మిల్లిమీటర్ల పొడవుతో గొట్టం ఆకారంతో, సన్నటి మూగుతో వుంటుంది. పుప్పొడితిత్తి అతి చిన్నదిగా పసుపుగా వుంటుంది. మగపువ్వుయొక్క తొడిమి లావుగా, పువ్వుక్రింద ఉంగరంలా ఉబ్బివుంటుంది. పువ్వు చిన్నదిగా వున్నప్పుడు దానిచుట్టు వుండిన చేటికతో ఈ ఉంగరంగా రూపొందవచ్చును. ఇహ ఆడపువ్వుల మంజరి బహుళసంఖ్యలో పువ్వులు కలిగివుంటుంది. కీలము 2 మిల్లి మీటర్ల పొడవున విడిగా ఉంటుంది. ఈచెట్టుయొక్క అసలుపండు పనసపండు కాదు, పనసపండులోని తొనయే. ఈ తొన తీయగా, అదోవిధమైన వాసనతో ఉంటుంది. ఈ తొనలలోపల 2.5 సెంటిమీటర్ల పొడవు, 1.6 సెంటిమీటర్ల మందంగల గింజలుంటాయి. పనసపండు 30-90 సెంటిమీటర్ల పొడవున, 20-40 సెంటిమీటర్ల మందాన వుంటుంది.

## ఉపయోగములు

పనస, దూద చక్కని చెట్టు. నీడకోసం దీనిని నాటుతారు. దీని ఆకులు ముదురాకు పచ్చగా వుండడంవలన చెట్టు అంత కళకళలాడుతున్నట్లనిపించదు. ద్వీపకల్ప భారతదేశంలో పనసచెట్టు బాగా కాయలు కాస్తుంది. ఆ ఋతువులో లభించే పండ్లలో పనస చాల ముఖ్యమైనది. ఈపండు, అది నచ్చినవారికి రుచికరంగా వుంటుంది; కాని ఎక్కువగా మాగితే అదో విధమైన వాసన వేస్తుంది. దీని కాయతో కూరవండుతారు. పండుని పచ్చిగా తింటారు. తొనలలోని గింజలను వంటకాలలోకి వాడుతారు. కోసినవెంటనే పనసచెక్క పసుపుపచ్చగా వుంటుంది. కొద్ది కాలానికి రంగు ముదురుతుంది. చివరకు 'మహాగనీ' కలపవలె తయారవుతుంది. దీనితో తయారయిన కుర్చీలు, మేజాలు మొదలయిన వాటికి మంచి గిరాకీ వుంది.

## స్వస్థలము

ఇప్పుడు పనసచెట్టు దేశమంతటా కనపడుతుంది. కాని మొదట ఇది పడమటి కనుమలలోని అడవులలో, 600-1000 మీటర్ల ఎత్తున పెరిగేది. అక్కడనుండి ఇతర ప్రాంతాలకు వ్యాపించింది. అస్సాము, బర్మా ప్రాంతాల అడవులలోకూడా పనస వున్నట్లు పేర్కొనబడింది.

## పెంపకము

ఆర్ద్ర, ఉష్ణప్రాంతాలలోని లోతైన సారవంతమైన నేలలయితే పనసకు చాల అనువైనవి; కాని ఇది ఎటువంటి నేలలలోనయినా పెరుగుతుంది. దీని ప్రవర్ధనము విత్తనాలద్వారా చేయడం మంచిది. చెట్టు ఎక్కడపెరగాలో అక్కడే విత్తనాన్ని నాటడం మేలు. దీని మొక్కను ఒకచోటనుండి తీసి ఇంకొకచోట నాటడానికి యత్నిస్తే దీని పొడుగాటి, నాజూకైన తల్లివేరు దెబ్బతింటుంది. వేళ్లు దెబ్బతినకుండా జాగ్రత్త తీసుకొనగలిగితే, గింజలను గంపలలో నాటి, పెంచవచ్చును. బాగా వెలుతురు తగిలేచోట వుంచి, మట్టి తడారిపోకుండా చూచుకుంటే మొక్క ఏపుగా పెరుగుతుంది.

పశ్చిమభారతదేశంలోని పూలచెట్లగురించి ఒక సుప్రసిద్ధ పుస్తకాన్ని వ్రాసిన బ్లైర్న్ పనసను గురించి ఇట్లా అన్నాడు: "పనసపండు చాలపెద్దది. ఇంత పెద్ద పండు మరొక్కటి ఈ ప్రపంచంలో లేనేలేదు. ఒక్కొక్కసారి పనసపండు 60 పౌండ్ల బరువుకూడా వుంటుంది. ఇది చెట్టుమీద వుండగా చూస్తే ఏదో పరాన్న భుక్కులా కనిపిస్తుంది. యూరపియన్లకు దీని వాసన గిట్టదు. కాని ఒకసారి తెగించి పనసపండు రుచిచూచిన నేను దానివాసన బాగానే వుందని చెప్పగలను. ఈ పండు చెట్టుయొక్క ఏభాగం మీద పుడుతుందన్నది చెట్టు వయస్సుమీద ఆధార పడివుందంటారు. మొదట కొమ్మలమీద, తర్వాత ప్రధానకాండంమీద, బాగా వయస్సుముదిరిన చెట్లమీదయితే వేళ్లమీద పండు పండుతుంది. దీని తెల్లటి చిక్కటి రసాన్ని పక్షులను పట్టడానికి బంకగా వాడుతారు."

## 6. భారతదేశమందలి కొన్ని 'కాంచన' గణపుచెట్లు

*BAUHINIAS OF INDIA*

*Family:* Caesalpiniaceae

ఈ గణానికి చెందిన ఎన్నోజాతులు మనదేశమందంతటా అడవులలోనూ తోటల లోను పెరుగుతున్నాయి. వీటిలో ఎక్కువగా కానవచ్చే కొన్ని జాతులను గురించి ఈ అధ్యాయంలో ముచ్చటించుకుందాము.

16, 17 శతాబ్దులకు చెందిన ఇద్దరు సుప్రసిద్ధ వృక్షశాస్త్రవేత్తలు-జీన్‌బహిన్, గెస్పార్డ్ బహిన్ అన్న ఇద్దరు ఫ్రెంచి అన్నదమ్ముల గౌరవార్థం ఈ గణానికి లిన్నె 'బాహినియా' అన్న పేరుపెట్టాడు. లిన్నె - "ఈగణపు చెట్ల ఆకు రెండేసి ఆకులవలె వుంటుంది. ఒకే మొదలునుండి, రెండు తమ్మె (భాగా) లుగా బయలు దేరే ఈ జంటాకు ఈ గొప్ప సోదరులిరువురిని గుర్తుకు తెస్తుంది - " అన్నాడు.

కాని ఈ ఆకులవలె వాళ్లిద్దరూ కవల సోదరులుమాత్రం కారు. జీన్ బాహిన్ 1541 - 1613 సంవత్సరాల మధ్య, గెస్పార్ బాహిన్ 1550 - 1624 సంవత్సరాలమధ్య జీవించి వున్నారు.

## కాంచనము

### *BAUHINIA PURPUREA* Linn

### ఆంగ్లముపేరు: PURPLE BAUHINIA

దీనికే తెలుగులో గోడెట్టి, గొరుగుర, బోడంచె, బోద, పెద్దారె-అన్న పేర్లూ ఉన్నాయి.

ఇది హిమాలయ పర్వత సానువులందలి సాలజాతి వృక్షాల అడవులకు చెందినది. మధ్య పరిమాణంగల ఈ చెట్టు హిమాలయాలలో 1000 మీటర్ల ఎత్తువరకు పెరుగుతుంది. తూర్పున అస్సాముదాక, దక్షిణాన ద్వీపకల్పప్రాంతందాక ఇది వ్యాప్తిచెందింది. దీని ఆకులు 10-14 సెంటిమీటర్ల పొడవున, వెడల్పుకన్న ఎక్కువ విడివి కలిగివుంటాయి. ఈ ఆకులు కొనలనుండి (తమ విడివిలో మూడవ వంతు లేక సగందాక) రెండు తమ్మెలుగా చీలివుంటాయి. ఈ తమ్మెలు కొనదేలిగాని, వర్తులంగాకాని వుంటాయి. ఆకు మొదలు వర్తులంగా వుంటుంది. ఆకులో 9-11 ఈనెలుంటాయి; వీటినుండి బలిష్ఠములైన పిల్ల ఈనెలు బయలుదేరి ఒంపులు తిరుగుతాయి. ఆకర్షణీయమైన, గులాబీ లేక ధూమ్రవర్ణపు పువ్వులు కొమ్మల చివర పూస్తాయి. కవచంవలె వున్న దీని రక్షక పత్రావళి రెండుగా చీలి వుంటుంది. దీనికి 4-5 సెంటిమీటర్ల పొడవుగల ఆకర్షకపత్రాలు అయిదుంటాయి. ఈ పత్రాలు (రేకులు) గులాబీరంగులోగాని ధూమ్రవర్ణంలోకాని వుంటాయి. వీటిలో ఒకటిమాత్రం మిగతా నాల్గింటికన్న ముదురురంగులో వుంటుంది. ఉన్న ఐదుకేసరములలో మూడింటికి మాత్రమే పుప్పొడితిత్తులుంటాయి; మిగతా రెండూ కూడా గొడ్డుమోతులు. దీనికాయ పొడవు 15-25 సెంటిమీటర్లు; వెడల్పు 12-18 సెంటిమీటర్లు. ఇది చదునుగా ఆకుపచ్చగా (లేక ధూమ్రవర్ణంగా) వుంటుంది. ముదిరేదాక తల్లిమొక్క వంటిపెట్టుకుని వుంటుంది. ముదరగానే తాప్పుమని

పగులుతుంది; అపుడు దానిలో గింజలు చెల్లాచెదరవుతాయి. హిమాలయసానువు లకు చెందిన ఈ చెట్టు భారతదేశంలోని అన్ని భాగాలలోను పెంచబడుతున్నది.

## పువ్వులు, కాయలు

కాంచనపు పువ్వులు సువాసనగా వుంటాయి. ఇవి సెప్టెంబరునుండి డిసెంబర్ దాక పూస్తాయి. కాంచనపు చెట్లున్నచోట వాటి పువ్వులలోని పుప్పొడికోసం, తేనెకోసం తేనెటీగలు ఝుమ్మంటూ వస్తుంటాయి. కాయలు పువ్వులింకా వుండగానే కాస్తాయి; జనవరి - మార్చి మాసాలలో ముదురుతాయి. అప్పుడు ఆ కాయలు పగిలి గింజలు రాలి నేలలోపడతాయి. కాని వర్షాలు వచ్చేదాక అవి అంకురించవు. ఈ గింజలలో నూటికి మూరు మొలకెత్తగలవు. కాని ఈ చెట్ల ఆకులను కొమ్మ లను ఆశించే పురుగులు ఈ గింజలను పాడుచేయడంచేత అన్నీ మొలకెత్తవు.

## పెంపకము

"సిల్వికల్చర్ ఆవ్ ఇండియన్ ట్రీస్" అన్న తన పుస్తకంలో ఆర్. ఎస్. ట్రూప్ ఈ క్రింది సూచనలు ఇచ్చారు:

ఈ చెట్టుకు వెలుతురు బాగా కావాలి. కనుక దీనిని పెద్దచెట్లకు, కట్టడాలకు దూరంగా నాటాలి. విత్తనాలను సారవంతమైన నేలలో 20-25 సెంటిమీటర్ల ఎడంలో నాటాలి. క్రమంతప్పకుండా నీరు పోస్తుంటే మొక్క చక్కగా పెరుగు తుంది. ఈ లేతమొక్కలను పీకి, మరొకచోట నాటేటప్పుడు వాటి సున్నితమైన వేళ్లకు ఎట్టి హాని కలగకుండా జాగ్రత్తపడాలి.

## ఉపయోగములు

ఈ చెట్టుయొక్క అన్నిభాగాలూ ఉపయోగపడతాయి. దీని ఆకులు పశు గ్రాసంగా పనికివస్తాయి. అద్దకపు, తోళ్ల పరిశ్రమలలో దీని బెరడు నుపయో గిస్తారు. ఒక మోస్తరు గట్టితనంగల దీని చెక్కను వ్యవసాయపుపనిముట్లు చేయడానికి వాడుతారు. దీనిపూవులను అలంకరణార్థం వినియోగిస్తారు. దీని

పూవులను ఉడికించిగాని, ఊరబెట్టిగాని తింటారు. కాని దీనిగురించి ఒక హెచ్చరిక చేయవలసివుంది. మట్టిక్రింద వున్న కాంచనపు చెట్టుయొక్క వేళ్ల బెరడు విషము; దీనిని ఏ కొంచెము తిన్నా హానికలుగుతుంది.

## శ్వేతకాంచనము

*BAUHINIA RACEMOSA* Linn

ఆంగ్లపు పేరు : **JHINJERI**

దీనినే అడవియవిసె, ఆప అనికూడా అంటారు.

అడవులలో పెరిగేచెట్లలో ఇది సుపరిచితమైనది. పశ్చిమభారతదేశంలో దీని ఆకులను బీడీలు చుట్టడానికి వాడుతారు. పువ్వులు చాల చిన్నవి. వాటిరంగు ఏమంత చెప్పుకోదగినదికాదు. ఈ చెట్టుమ్రాను కురుచగా, వికృతంగా ఉంటుంది. అయితే ఈ జాతిచెట్లు సారహీనమైన నేలలలోను శిలామయమైన నేలలలోను కూడా పెరుగుతాయి. అట్టి విశాలమైదానాలలో నేలకోత నరికట్టి మట్టిని రక్షించ డానికి శ్వేతకాంచనం ఎంతగానో ఉపకరిస్తుంది.

## దేవకాంచనము

*BAUHINIA TOMENTOSA* Linn

ఆంగ్లపు పేరు : **PUBESCENT BAUHINIA**

దేవకాంచనమునకే దేవకాంతి, పాలెపి, అడవిమందార, కచిని అన్న పేర్లు వున్నాయి.

ఇది చాల చిన్నచెట్టు. చూడడానికి శ్వేతకాంచనమువలెనే వుంటుంది. సౌరాష్ట్ర ప్రాంతమందలి గిర్నార్ కొండచరియలలో అనంఖ్యాకములైన దేవకాంచ నపు చెట్లను నేను చూచాను. కాని ఇవి స్వతహాగా అక్కడివో లేక వాటి నక్కడ అటవీశాఖవారు నాటారో నేను చెప్పలేను. దీని పూవులు 7 సెంటిమీటర్ల పొడ వున, తెల్లగాను, మందమైన పసుపురంగులోను వుంటాయి. ఇటీవల ఎన్నో తోటలలో దేవకాంచనాలను నేను చూచాను. చెట్ల అంచులలో గుత్తులు గుత్తులుగా పెద్దపెద్ద పువ్వులతో - ఇవి కంటికి విందుగా కనుపించాయి.

## రక్తకాంచనము

### *BAUHINIA VARIEGATA* Linn

ఇంగ్లీషు పేరు: **VIRIEGATED BAUHINIA**

**దీని నామాంతరాలు:** బోద, బోదంట, కోవిదార, కచిని మందరి, పెదమ.

దీనిని మనదేశమంతటా తోటలలో పెంచుతారు. దీనిని కాంచనము (బాహినియా పర్ప్యూరియా) నుండి పోల్చుకోవడం చాలకష్టం. ఇవి రెండూకూడా ఒకదానిలాగే ఇంకొకటి వుంటాయి. కనుక వీటిలో ఏది ఏదని అరితేరిన వృక్షశాస్త్రజ్ఞులే కష్టంమీదగాని చెప్పలేరు. దీనిని అమెరికాలో "బుద్ధిస్ట్ బాహినియా" అంటారు. దీని పుష్పములు తెల్లగానో, ధూమ్రవర్ణంగానో వుంటాయి. రెండు రంగుల పువ్వులూ ఒకేచెట్టున పూస్తాయి. ఇది మనదేశంలో బెట్టగావుండే కొండ ప్రాంతాలకు చెందినది. ద్వీపకల్ప భారతమున తోటలలోను, సముద్రతీర ప్రాంతాలలోను దీనిని ఎక్కువగా పెంచుతారు.

## అద్ద

### *BAUHINIA VAHLII* Wight & Arn

ఇంగ్లీషు పేరు: **CLIMBING BAUHINIA**

ఇది ఏపుగా పెరిగే తీగ. దీనిని మదుపుతీగ అనికూడా అంటారు. అడవులలో ఇది ఎంత ఎత్తుగా వుండే చెట్లమీదకు సైతం అల్లుకుపోతుంది. ఇట్లా దట్టంగా అల్లుకుపోయి, ఉపయోగకరములైన ఆ చెట్ల శిఖరాలకు ఎండతగలకుండా చేస్తుంది. పువ్వులు పెద్దపెద్ద గుత్తులుగా కొమ్మలచివర పూస్తాయి. దీని ఆకర్షక పత్రావళి పసుపుగా లేదా తెలుపుగా 7 సెంటిమీటర్ల వెడల్పున వుంటుంది. గుంపులు గుంపులుగా వున్న పువ్వులతోను, చిత్ర విచిత్రముగా అల్లుకుపోయే నులితీగలతోను ఇది కన్నులపండువుగా వుంటుంది. దీని ఆకులను భోజనం చేయడానికి (అరటియాకులవలె) వాడుతారు. 25 సెంటిమీటర్ల పొడవు, 7.10 సెంటిమీటర్ల వెడల్పు గల దీని కాయలు గట్టిగా, పెంకుకలిగి వుంటాయి. ఈ తీగ వున్నప్రాంతాలలోని

కొండజాతులవారు దీని గింజలను తింటారు. బొంబాయి అడవులలో, ముఖ్యంగా పడమటి కనుమలలోని కీకారణ్యాలలో ఈతీగ అక్కడక్కడ కనబడుతుంది. హిమాలయాల విష్ణుశ్రేణినుండి దక్షిణంగా, తూర్పు కనుమలదాక అద్దతీగ వ్యాప్తిచెందింది. ఇది చాల అందమైన మొక్క: కాని అడవులలోని చెట్లను ఈతీగ బారినుండి రక్షించడానికి అటవీ సంరక్షణాధికారులు చేసే ప్రయత్నాలవలన, ఆహారనిమిత్తం దీనిగింజలను సేకరించే కొండజాతులవారివలన ఈతీగ బాగా దెబ్బతింటూంది.

## బెజ్జపుఆకుల కాంచనము

*BAUHINIA FOVEOLATA* Dalz

ఇంగ్లీషు పేరు: **PORE-LEAVED BAUHINIA**

ఇది అంత ఎక్కువగా కానరాదు. కాని దీని విచిత్రమైన పేరు కారణంగా దీనిని పేర్కొనాలి. ఇది పడమటి కనుమలలో బాగా పెరుగుతూంది. ఈచెట్టు ఎత్తు 25 మీటర్లుంటుంది; ఒక్కొక్కసారి 30 మీటర్లదాక కూడ పెరుగుతుంది. దీని పువ్వులగురించి చెప్పవలసినదేమీలేదు. కాని దీని ఆకులుమాత్రం చాలపెద్దవి. అవి 30 సెంటిమీటర్ల వెడల్పున వుంటాయి.

'ఫోవియోలై' అనగా సన్నటి బెజ్జములు అని అర్థం; దానినిబట్టే ఈ చెట్టు యొక్క శాస్త్రీయనామమైన 'ఫోవియొలాటా' అన్నపదం వచ్చింది. ఈ ఆకు అడుగుభాగాన సన్నటి బెజ్జాలుండడం కారణంగా ఈపేరు ఏర్పడింది. ఈ బెజ్జం నుండే అతి సన్నటి తీగఒకటి వెలువలికి వస్తుంది. ఈతీగ చివరవున్న ఒక 'బిరడా' లాటిది ఆ రంధ్రాన్ని మూసినట్లుంటుంది. ఒకవిధంగా ఇది ఆధునిక గృహాలలో వుండే 'వాష్ బేసిన్' లో వుండే 'బిరడా' 'గొలుసు' లను పోలి వుంటుంది. ఎటొచ్చీ ఈ ఆకులలోని 'గొలుసు' (అతి సన్నటితీగ) 'బేసిన్' (బెజ్జం) లో నుండే వస్తుంది.

# 7. బూరుగ

## *BOMBAX CEIBA* Linn

***Family*: Bombacaceae**

**ఆంగ్లపుపేరు : SILK COTTON TREE**

### పేర్లు

మనదేశపు వృక్షశాస్త్ర సాహిత్యానికి సంబంధించినంతవరకు, బూరుగవలె వృక్ష శాస్త్రజ్ఞులను, అటవీశాస్త్రజ్ఞులను తికమకపెట్టిన చెట్టు మరొక్కటి లేదు. దీనికే 'బొంబాక్స్ మలబారికమ్' 'సాల్మాలియా మలబారికం ', 'బొంబాక్స్‌సీబా', అన్న వివిధమైన పేర్లున్నాయి. మనదేశంలో చాల ప్రాంతాలలో ఇది 'సిమల్' అన్న పేరుతో పిలువబడుతూంది. ఇంగ్లీషులో దీనిని 'కాటన్‌ట్రీ' అనీ 'సిల్క్ కాటన్ ట్రీ' అనీ పిలుస్తారు. ఒక్కొక్కసారి దీనినే 'ది ఫ్లేమ్ ఆఫ్ ది ఫారెస్ట్' అని కూడా వ్యవహరిస్తుంటారు. కాని 'ది ఫ్లేమ్ ఆఫ్ ది ఫారెస్ట్' అన్న పేరు 'తొగరుమోదుగ'[1] కే చెందుతుంది. బూరుగయొక్క గణనామమైన 'బొంబాక్స్' అన్నది దాని కాయలనుండి లభించే ప్రత్తివలన వచ్చింది. 'సాల్మాలియా' అన్నది 'శాల్మలి' అన్న సంస్కృత పదంనుండి జన్మించింది. బ్రహ్మదేవుడు సృష్టి అనంతరం ఈ చెట్టుక్రింద విశ్రాంతి తీసుకున్నాడని గాథలు చెబుతాయి.

### వర్ణన

బూరుగచెట్టు 25 మీటర్ల ఎత్తుదాక పెరుగుతుంది. దీని కొమ్మలు బాగా విస్తరిస్తాయి. ఇది ఆకులు రాల్చుతుంది. దీని చెక్క మెత్తగా వుంటుంది. కలప లేతరంగులో వుంటుంది. కాని చిన్నప్పుడు దీని బెరడుమీద త్రికోణాకారపు ముళ్లుంటాయి; ఆ ముళ్ల ధర్మమా అని ఈచెట్టు జంతువుల బారినుండి మనుష్యుల

---

• 1. తొగరు మోదుగ: ఈ పుస్తకంలోనే 8-వ అధ్యాయం చూడండి-అను.




పటము 6. బూరుగ

శాఖనుండి బ్రతికి బయటపడుతుంది. దీని ఆకులు పెద్దగా, దళసరిగా, ప్రకాశవంత మైన ఆకుపచ్చరంగులో వుంటాయి. దాని ఆకు 5-7 ఉపదళాలుగా చీలుతుంది. ఈ ఉపదళం ఒక్కొక్కటీ ఆకువలె వుంటుంది. ఈ ఉపదళాలన్నీ కలిపి విసన కర్రలావుంటాయి. ఉపదళం బల్లెపు ఆకారంలో. రెండువైపుల మొనదేలివుంటుంది; దీనివిందా ఈనెలుంటాయి. ఈ చెట్టుమీద సంవత్సరంలో అధికభాగం ఆకులు వుంటాయి. అందువలననే నీడనిచ్చే మంచిచెట్లలో దీనినొకటిగా పరిగణిస్తారు. పూత మొదలుపెట్టేముందుగా ఆకులు రాలిపోతాయి. అప్పుడిహ ఈచెట్టు వికృత మైన అస్థిపంజరంలా వుంటుంది. కాని ఇట్లా ఎంతోకాలం వుండదు. జనవరి ఆఖరివారంలో ఆకులురాల్చి, ఫిబ్రవరిలో పూలు తొడుగుతుంది.

బూరుగ పువ్వులు కాంతివంతమైన సింధూరవర్ణంలో వుంటాయి. ఒకటీ అరా పువ్వులు పసుపుగానో తెల్లగానో వుండవచ్చును. పసుపుపువ్వులున్న బూరుగ చెట్టుకు ఏవో దివ్యశక్తులుంటాయని ప్రజలు విశ్వసిస్తారు. అందువలన ఇటువంటి చెట్టు బెరడునుండి చెక్కనుండి 'వరాలు' పొందాలని ప్రయత్నించే 'భక్తుల' ధర్మమా అని ఆచెట్టు నాశనమవుతుంది.

ఆకులు లేనప్పుడు పువ్వులు వస్తాయి. అసంఖ్యాకములైన ఈ పువ్వులు కురి పించే రంగుల వానలో తడిసి, మెరిసిపోతూ విల్చునుంటుంది బూరుగచెట్టు. ఇంత శోభాయమానంగా కనులవిందు చేయగల చెట్లు మరేవీ ఈ భూమిమీద లేవనడం అతిశయోక్తి కానేకాదు. మధువుకోసం ఈ వృక్షాన్నాశ్రయించే పక్షిసముదాయం దీని పిన్నాళాన్ని పెంపొందిస్తాయి. ఈ చెట్టున చేరిన పిచ్చుకలు, కాకులు, మైనాలు మున్నగు పక్షులు వివిధస్థాయిలలో చేసే కలకలారవమును వింటూంటే ప్రకృతి ఏర్పాటుచేసిన జంత్రవాద్యసమ్మేళనమేమో అనిపిస్తుంది. ఇంతటి అందాన్నిచూచి, విని కూడా కదలని వారికి హృదయమే లేదని చెప్పవచ్చును.

దీని రక్షకపత్రావళి దళసరిగా గిన్నెవలె వుంటుంది; లోపల పట్టువలె, బయట నున్నగాను వుంటుంది. దీని రేకులు (ఆకర్షకపత్రాలు) మందంగా, 12 సెంటి మీటర్ల (జేన అంతకన్న ఎక్కువ) పొడవున, 2-3 సెంటిమీటర్ల వెడల్పున వుంటాయి. దీని కేసరములు పువ్వుమధ్య కట్టలు కట్టలుగా వుంటాయి. మామూలు బూరుగలో 60 కేసరములదాక వుంటాయి. మనదేశంలోని ఇతర బూరుగ

రకాలలో 60 నుండి 600 దాక వుంటాయి. ఈ కేసరములుకూడా రేకుల రంగు లోనో అంతకన్న కొద్దిగా పాలిన రంగులోనో వుంటాయి. దీని కాయ కోడిగ్రుడ్డు ఆకారంలో 10.15 సెంటిమీటర్ల పొడవున. 3-5 సెంటిమీటర్ల మందాన వుంటుంది. ఈ కాయలో ఐదు 'అర' లుంటాయి. కాయ పక్వానికి రాగానే ఈ 'అర' లు తెరుచుకుంటాయి; వీటిలోనుండి చుట్టూ ప్రత్తిగల నల్లటిగింజలు చెదరి, ఎగిరి పోతాయి. మీ ఇంటిచుట్టుపట్ల గనుక ఒక్క బూరుగ చెట్టుంటే చాలు మీ ఇంటి నిండా ప్రత్తే। గాలి వీచినప్పుడెల్లా ప్రత్తి ఇంటిలోకి వస్తుంటుంది; ఇంటిని శుభ్రంగా వుంచడం కష్టమైపోతుంది.

## ఉపయోగములు

బూరుగు చాల ఉపయోగకరమైనచెట్టు. దీని ప్రతిభాగమూ పనికివస్తుంది. దీని మెత్తటి చెక్కను అగ్గిపుల్లల తయారీలో వాడుతారు. ఒక్క బొంబాయి నగరానికి మాత్రమే అగ్గిపుల్లల రూపేణా సాలీనా లక్షటన్నుల కలప కావలసివస్తున్నది. దేశపు ఇతర ప్రాంతాలలో భారీసామగ్రిని 'పేక్' చేయడానికి వలసిన పెట్టెలు చేయడానికి ఈ కలపను వాడుతారు. జాలరులు తమ వలలను తేలేటట్లు చేయడానికి దీనినే వాడుతారు. అయితే చెదలు ఎక్కువగా ఈ చెక్క నాశ్రయిస్తాయి. అందువలన దీనితో పక్కానిర్మాణపు పనులేమీ తలపెట్టడానికి వీలులేదు. బూరుగప్రత్తి నూలుగా వడకడానికి వీలులేనంత పొట్టిగా వుంటుంది. కనుక దీనిని పరుపులు, దిండ్లు నింపడానికి ఉపయోగిస్తారు. ఈ చెట్టు కోతలనుండి పగుళ్లనుండి కార్చే బంకకు 'మోచరస్' అనిపేరు; ఈ మోచరస్ బంక ఆయుర్వేదవైద్యంలో మందుగా వాసికెక్కినది.

## వీధిచెట్టుగా

ప్రకాశవంతమూ, మనోహరమూ అయిన పువ్వుల కారణంగానయితేనేమి, దట్టమైన దీని ఆకులు ఇచ్చే నీడ కారణంగా నయితేనేమి అటు అడవులలోను ఇటు నగరవీధులలోను వుండవలసిన మేలైన వృక్షాలలో దీనిని ఒకటిగా భావించాలి. మెత్తటి చెక్కకారణంగా తుఫానులు మొదలైన వాటి దెబ్బకు తట్టుకోలేక పడిపో

గల ఈ చెట్టుకు తగు రక్షణ కల్పించాలి. ఇటువంటి రక్షణ దొరికి, విస్తరించ దానికి తగు చోటు వుంటే బూరుగవంటి చెట్టేలేదు.

పెంపకము

దీని పెంపకము చాల సులభము. ఎటువంటి నేలలోనయినాసరే బూరుగ విత్తనాలనుకాని కాండపు ముక్కలనుగాని నాటితే ఇది పెరుగుతుంది. మొక్క చిన్నవయసున వుండగా దాని ఆకులను ఆవులూ మేకలూ తింటాయి. కాని కొంత పెరిగాక దీని కాండంమీద ఏర్పడే ముళ్లు దీని విటువంటి బెడదలనుండి కాపాడుతాయి.

# 8. తొగరు మోదుగ

*BUTEA MONOSPERMA* Taub

*Family :* Papilionaceae

ఇంగ్లీషు పేరు : **THE FLAME OF THE FOREST**

తొగరు మోదుగనే, తెల్లమోదుగ, కింశుకము, ఫలాశము, వాతపోధము అని కూడా వ్యవహరిస్తారు.

మన సాహిత్యంలో "ఫ్లేమ్ ఆవ్ ది ఫారెస్ట్" ("అటవీజ్వాల") అన్న పేరుతో చలామణీ అవుతున్నచెట్లు మూడు నాలుగున్నాయి. ముఖ్యంగా బూరుగచెట్టు నీ పేరుతో వర్ణిస్తుంటారు. బాడిదను కూడా ఇదేపేరుతో పిలుస్తారు. కాని నిజానికి ఈ బిరుదము తొగరు మోదుగకే (దీనికే 'బ్యూటియా ఫ్రాండోసా-కోయెన్' అన్న శాస్త్రీయనామమూ వుంది) చెందాలి.

## వర్ణన

మధ్య పరిమాణంగల ఈచెట్టు ఆకులు రాల్చుతుంది. దీనిమ్రానూ, కొమ్మలూ వంకరటింకరగా వుంటాయి. బొంబాయిప్రాంతంలో తొగరుమోదుగచెట్లు 6 మీటర్ల కన్న ఎక్కువ ఎత్తుకు పెరగడం నేను చూడలేదు. దీని బెరడు బూడిదరంగులో, లేక, లేతగోధుమరంగులో వుంటుంది. దీని ఆకు త్రిదళముగానుంటుంది; అనగా 8-12 సెంటిమీటర్ల పొడవుగల తొడిమెచివర మూడు ఉపదళాలుగా వుంటుంది. ఈ మూడు దళాలలో రెండు 8-12 సెంటిమీటర్ల వెడల్పున, ఎదురెదురుగా వుంటాయి; మూడవదళం పెద్దదిగా, 12-20 సెంటిమీటర్ల వెడల్పున, మిగతా రెండింటికి కాస్త ఎడంగా వుంటుంది. ఈ మూడు దళాలూ దళసరిగా, బిరుసుగా వుంటాయి. కొనదళంయొక్క మొదలు ఇరువైపుల సరిసమానంగా వుంటుంది. ప్రక్కదళాల మొదలు అట్లా వుండదు. ఈ మూడింటియొక్క మొనలూ వర్తులంగా వుంటాయి. లేతదళాలు పట్టువలె వుంటాయి. ముదిరాక ఇవి నూగులేక, నున్నగా వుంటాయి. ఆకులు చలికాలంలో రాలుతాయి. ఫిబ్రవరి-మార్చి నెలలలో-వేసవి ప్రారంభంలో, ఆకులు లేకుండా వున్నప్పుడు పువ్వులు పూస్తాయి. పువ్వులు పెద్దవి; ఒక్కొక్కపారి బొటనవ్రేలంతకూడా వుంటాయి. లేతకొమ్మల కణుపులమీద ఇవి పూస్తాయి. పర్ణవిహీనమైన శాఖలమీద ఇవి గుత్తులు గుత్తులుగా దర్శనమిస్తాయి. ఈ పువ్వుల తొడిమెలూ, పువ్వులు పూచే కణుపులూ కూడా వెల్వెట్‌లా, ముదురాకు పచ్చరంగులో లేక నల్లగా వుంటాయి. ఈ పువ్వుయొక్క రక్షకపత్రావళి ఎగుడు దిగుడుగావున్న 'కప్' వలె వుంటుంది. ఇది బయట ముదురాకు పచ్చగాను, లోపల నన్నటి నూగుతోను వుంటుంది. ఈ కప్‌యొక్క అంచున అయిదు 'పళ్లుం'డాలి కాని ఈ అయిదింటిలో రెండు కలిసిపోయి, మొత్తం నాలుగే వున్నట్లు కనుపిస్తాయి. ఆకర్షక పత్రాలు 3-5 సెంటిమీటర్ల పొడవున, కాంతివంతమైన నారింజరంగులో, వెలుపలివైపు పట్టువారాలవంటి నూగు కలిగివుంటాయి. దీని కాయ 'లెగ్యూము' జాతిది; ఈకాయ ద్వివిదారకము—అనగా, రెండువైపుల పగులునది. ఇది 12-18 సెంటి మీటర్ల పొడవున, 4-5 సెంటిమీటర్ల వెడల్పున వుంటుంది. ఈ కాయయొక్క కొనదేలిన చివరిభాగంలో ఒకేఒక పెద్దగింజ వుంటుంది. లేత కాయలమీద

దట్టంగా నూగు వుంటుంది; క్రమంగా ఈనూగు పెంట్రుకలవలె కనపడుతుంది. ఈ కాయలు చూడడానికి అందంగా వుండవు. ఎందుకోగాని, నాకుమాత్రం ఈ కాయలు, చెట్టుమీద వ్రేలాడుతున్న చెప్పులవలె అనిపిస్తాయి.

## వ్యాప్తి

సముద్రమట్టంనుండి 1000 మీటర్ల ఎత్తువాక మనదేశమంతటా, బర్మాలోను తొగరుమోదుగ పెరుగుతుంది. మధ్యభారతములోని ఆకులురాలేచెట్లున్న బెట్ట అడవులలో ఇది కనపడుతుంది. గుజరాతు, సౌరాష్ట్రలలోని ఇసుకప్రాంతాలలోను దీనిని చూడవచ్చును. బొంబాయి సమీపంలోనయితే, కల్యాణ్ నుండి ఇగత్ పురిదాక కల్యాణ్ నుండి ఖాండ్లాదాక రహదారుల, రైలుదారుల ప్రక్కలగల కొండలపై తొగరుమోదుగ కనపడుతుంది. ఫిబ్రవరిమాసం చివరగాని, మార్చిమొదటగాని ఈ ప్రాంతాన్ని చూస్తే దీనిని "ఫ్లేమ్ ఆఫ్ ది ఫారెస్ట్", 'అటవీజ్వాల' అన్న పేరు ఎందుకు వచ్చిందో అర్థం అవుతుంది. ఈ అడవులలో ముఖ్యంగా, ఆకులులేని చెట్లమీద రంగుతివాసీ పరచినట్లు ఈ పువ్వు లుంటాయి.

## ఉపయోగములు

తొగరుమోదుగను తోటలలోగాని వీధుల ప్రక్కలగాని అరుదుగా పెంచుతారు. అయితే పూతమీదవుండగా తప్ప ఈచెట్టు అంత అందంగా వుండదు. దీని ఆకులను, కొమ్మలను కోసేవారివలన ఈ చెట్టు దెబ్బతింటుంటుంది. కొంకణ్ ప్రాంతపు రైతులు తొగరుమోదుగ కొమ్మలనుతెచ్చి వరిపొలాలమీద పరుస్తారు. దీని ఎండుకొమ్మలను విడిగాగాని, పిడకలతో కలిపిగాని వంటచెఱకుగా వాడుతారు. దాని మానాన దాన్ని విడిచిపెడితే తొగరుమోదుగ సారహీనమైన నేలలలోకూడా బాగా పెరుగుతుంది. మనదేశంలోని ఇసుకనేలలలోనూ బెట్టప్రాంతాలలోను కూడా ఇది చక్కగా పెరుగుతుంది. అంటే సారహీనమైన నేలల పునరుజ్జీవనానికి తొగరుమోదుగ ఉపకరించగలదన్నమాట. మనదేశంలోని పలుభాగాలలో లక్కపురుగును పెంచడానికి తొగరుమోదుగ చెట్టును ఉపయోగిస్తారు. తొగరుమోదుగనుండి వచ్చే లక్క అంత నాణ్యమైనది కాకపోయినా, ఈ చెట్టు ఇచ్చినంత లక్క మరే చెట్టూ ఇవ్వదు. ఈ చెట్టుబెరడుకు గాటుపెడితే ఎర్రటిపాలు కారు

తుంది; ఇది గాలికి చిక్కబడి ఎర్రటి బంకగా తయారవుతుంది. ఈ బంకను 'బెంగాలి కినో' అంటారు. దీనిని విరేచనా లరికట్టడానికి మందుగా వాడతారు. బిళ్ల పురుగులను, బద్దీపురుగులను నివారించడానికి తొగరుమోదుగ గింజలను వాడుతారు. కాని ఈ గింజలు నులిపురుగుల నరికట్టలేవు. దీని ఆకులను విస్తరాకులుగా, దొన్నె (దొప్ప) లుగా ఉపయోగిస్తారు. కొన్నిచోట్ల ఈ ఆకుతో బీడీలు చుట్టుతారు.

మీరొక రమణీయమైన వర్ణభరితమైన దృశ్యం చూడదలచుకుంటే—తన్కో చెరువువైపు వెళ్లే పెద్దరోడ్డుమీద వెళ్లండి. లేక బొంబాయినుండి ఢిల్లీకి పశ్చిమ రైల్వేమీదుగా వెళ్తున్నప్పుడు 'కోట' ప్రాంతంలో జాగ్రత్తగా పరికించండి. అప్పుడు తెలుస్తుంది తొగరుమోదుగను 'అటవీజ్వాల' అని ఎందుకు వర్ణించారో!

పోతే, 'బ్యూటియా' అన్న పేరును జాన్ స్టూవర్ట్ అన్న మూడవ 'బ్యూట్' ప్రభువు సంస్మరణార్థం కోనిగ్గో లేక రాక్స్బర్గో పెట్టారు. ఈ మూడవ బ్యూట్ ప్రభువు—తన సంస్థానమైన బ్యూట్‌లో వ్యావసాయికమైన, వృక్షశాస్త్రసంబంధమైన కృషిలో నిమగ్నుడయి వుండేవాడు. 'ఫ్రాందోసా' అన్న జాతి నామము నకు—"ఆకులతో నిండిన" అని అర్థం. ఒక విత్తనం కలది అగుటచేత 'మానో స్పెర్మా' అన్న పేరు ఏర్పడింది.

## 9. పున్నాగ

*CALOPHYLLUM INOPHYLLUM* Linn

*family :* Guttiferae

ఆంగ్లపు పేరు : **ALEXANDRIAN LAUREL**

పున్నాగకే - పొన్న, నమేరు, పునాస అన్న నామాంతరాలున్నాయి.

సుందరమూ, సతతహరితమూ అయిన పున్నాగచెట్టు మనదేశపు తూర్పు, సర మటి భాగాలకు చెందినది. ఇక్కడనుండి తూర్పుదిశను బర్మా, మలయాలగుండా



పటము. 7. తొగరు మోదుగ

(చూడు : పుట 27)

ఆస్ట్రేలియాదాక, దక్షిణదిశను సింహళందాక, పశ్చిమదిశను తూర్పు ఆఫ్రికా ద్వీపాలదాక వ్యాప్తిచెందింది. పున్నాగ సముద్రతీరప్రాంతాలలో, వే రెట్టిచెట్లూ బ్రతకని ఇసుకనేలలలో పెరుగుతుంది. బొంబాయి మొదలు రత్నగిరిదాకాను, అండమాను ద్వీపాలలోను పున్నాగ అధికంగా కానవస్తుంది. దీనిని తీరప్రాంత నగరపు వీధులలో పెంచుతున్నారు. ముదురాకు పచ్చరంగు ఆకులతో, పరిమళభరితమైన తెల్లటి పూవులతో అలరారే పున్నాగచెట్టు అతి మనోహరమైనది. దీని గణనామమైన 'కేలోఫైలమ్' (అందమైన ఆకులు గలది) అన్నది సార్థకనామధేయము. 'ఇనోఫైలమ్' (లావుపాటి ఈనెలు గలది) అన్న జాతి నామము ఈ చెట్టుయొక్క ఒక ముఖ్యగుణాన్ని తెలియజేస్తుంది.

## వర్ణన

పున్నాగ నున్నటి, ముదురురంగు బెరడుతో వుంటుంది. ఇంచుమించు కోడి గ్రుడ్డు ఆకారంలో వుండే దీని ఆకులు ఎదురెదురుగా, జతలు జతలుగావుంటాయి. ఈ ఆకుల అంచులు కొద్దిగా వెనుకకువంగి వుంటాయి. ఈ ఆకుమధ్య వున్నపెద్ద ఈనెనుండి బయలుదేరిన పిల్లఈనెలు ఇటూ అటూ సమానాంతరంగా వుంటాయి. ఆకు తొడిమె లావుగా, బల్లపరుపుగా వుంటుంది. పువ్వులు, 2.5 సెంటిమీటర్ల వ్యాసంతో వదులైన విడివి గెలలుగా ఆకుల చంకలలో పూస్తాయి. రక్షకదళాలు నాలుగుంటాయి. ఇవి వర్తులంగా వుంటాయి. కేసరములు అసంఖ్యాకములుగా వుంటాయి. వీటి పోగులు కట్టలు కట్టలుగా కలిసివుంటాయి. మెలికలు తిరిగిన కీలముపైన ఒక్కగొడుగువంటి కీలాగ్రముంటుంది. కాయ వెడల్పు 2-3 సెంటిమీటర్లుంటుంది; మొదట ఆకుపచ్చగా, తర్వాత పసుపుపచ్చగా వుంటుంది.

## ఉపయోగములు

వీధుల ప్రక్కల పున్నాగను పెంచడానికి కారణం దాని అందమైన రూపమే ! దీని గింజలనుండి తీసిన నూనెను దీపాలలోకి వాడుతారు. ఈ నూనె పక్షవాత సంబంధమైన వ్యాధులకు, పుండ్లకు మందుగా ఉపయోగిస్తారు. దీని బెరడునుండి తీసిన రసం విరేచనకారి. పున్నాగచెక్క గట్టిగా వుంటుంది: దీనితో నౌకలు




పటము 8. పున్నాగ

విర్మిస్తారు. దీని బెరడుమీదగాని, కాయంమీదగాని గంట్లుపెడితే బంకవస్తుంది. ఇదే వెస్టిండీస్‌లో లభించే 'తకమహకా' బంక అని కొందరు భ్రమపడుతుంటారు.

## 10. సోనాలు

*CASSIA FISTULA* Linn.

*Family :* Caesalpiniaceae

ఆంగ్లపు పేర్లు : **INDIAN LABURNUM, AMALTAS TREE**

రేల, రేలు, అరగ్వధము, సువర్ణము, కోలపొన్న అన్నవి సోనాలు,
రేలంగియొక్క మారుపేర్లు.

మనదేశపు చెట్లలో సోనాలు అంత అందమైనచెట్లు కొన్నే వున్నాయి. వేసవిలో సోనాలు కొండలకొక క్రొత్తశోభను తెచ్చిపెడుతుంది. దీనివంటి పూలనే పూచే 'యూరపియన్ లాబర్నం' అన్న దానినిబట్టి సోనాలుకు 'ఇండియన్ లాబర్నం' అన్న పేరువచ్చింది. దీని జాతినామమైన 'ఫిస్టులా' అనగా 'రెల్లుగొట్టము' లేక 'వేణువు' అని అర్థము. సోనాలు కాయయొక్క ఆకార పరిమాణాలబట్టి ఈ పేరు వచ్చింది. 'కేషియా' అన్న పదం గ్రీకు పురాణేతిహాసాలనుండి గ్రహించబడింది.

### వర్ణన

సోనాలు 6-15 మీటర్ల ఎత్తుదాక పెరుగుతుంది. దీని మ్రాను పొట్టిగా వుంటుంది. దీని ఆకులు ముదురాకు పచ్చగా వుంటాయి: ఇవి భిన్నపత్రాలు: ఒక్కొక్క భిన్నపత్రంలోనూ 4-8 జతల ఉపదళాలుంటాయి. ఈ ఉపదళాలు




పటము 9. రేలాలు

5-12 సెంటిమీటర్ల పొడవున, 3-8 సెంటిమీటర్ల వెడల్పున వుంటాయి. మార్చి మేనెలల మధ్య ఆకులు రాలిపోతాయి. ఇట్లా ఆకులన్నీ రాలిపోయాక, సోనాలు పూస్తుంది. సోనాలపూలు నిడివి గెలలుగా పూస్తాయి. నిడివిగెల మొదలువద్ద వుండే పువ్వులు మొదట విచ్చుకుంటాయి. ఒక్కొక్క పువ్వు ప్రకాశవంతమైన పసుపురంగులో, 3·5—5 సెంటిమీటర్ల వెడల్పున వుంటుంది. పువ్వులో పది కేసరములుంటాయి. వీటిలో మూడు పొడవుగాను, నాలుగు పొట్టిగానూ, మూడు మరీ పొట్టిగాను వుంటాయి. పొడవుగా వున్న మూడు కేసరాలే సంపర్కయోగ్యమైనవి.

కొండప్రాంతాలలో ఈ చెట్లున్నచోట - వీటి కాయలు ఇట్టే మన దృష్టి నాకర్షిస్తాయి. ఈ కాయలు 50-60 సెంటిమీటర్ల పొడవున, 2-2·5 సెంటిమీటర్ల మందాన వుంటాయి. ముదురుకాయలరంగు నల్లగా వుంటుంది. దీని పైపెంకు మీద వున్న గీతలవంటివి కాయలోపలి విభాగాలను సూచిస్తాయి. ప్రతి చెట్టు మీద వందదాక ఈ కాయలు వ్రేలాడుతుంటే చూడ ముచ్చటగావుంటుంది. ఈకాయలోపల ఎన్నో అరలుంటాయి. ఈ అరలమధ్య 'గోడ' లుంటాయి. ఒక్కొక్క అరలో ఒక చదునైన గింజ వుంటుంది. ఈ అరల గోడల నంటిపెట్టుకుని ఒక నల్లటి, తీయటి గుజ్జుపదార్థం వుంటుంది. ఇది విరేచనకారి.

## వ్యాప్తి

ఆకులతోగాని పూవులతోగాని వున్న సోనాలుచెట్టు నఖశిఖపర్యంతమూ నేత్రపర్వంగా వుంటుంది. అందుకనే సోనాలు దేశమంతటా వీధులను, తోటలను అలంకరిస్తుంది. బొంబాయిలో ఇరుప్రైపులా సోనాలున్న ఒక వీధిని 'లాబర్నమ్ రోడ్' అని పిలుస్తారు. ఢిల్లీ, కలకత్తా మొదలైన పట్టణాలలో ఎండాకాలంలో సోనాలుచెట్లు విరగబూచి విన్నాణాలొలుకుతూ నిలుచునుంటాయి. సోనాలు—ద్వీపకల్ప భారతంలోని చాలా ప్రాంతాలలో, ముఖ్యంగా కొండలందలి ఆకులురాల్చే చెట్లున్న అడవులలో—దానంతట అదిగా పెరుగుతుంది.

## పెంపకము

దీని ప్రవర్ధనమును విత్తనాలద్వారా కొనసాగించవచ్చును. అయితే దీని గింజలు మొలకెత్తడానికి ఒక్కొసారి ఏడాదిదాకా పడుతుంది; కనుక తోటమాలుల

కిది ఒక సమస్యగా తయారవుతుంది. అందుచేత విత్తనాలను మొదట పూలకుండీ లలో నాటి, బాగా నీరుపోస్తే, అవి సులభంగా మొలకెత్తుతాయి; ఆ లేతమొక్క లను వర్షర్తు ప్రారంభంలో కుండీలలోనుండి తీసి కావలసినచోట నాటవచ్చును.

### ఉపయోగములు

అలంకరణార్థమే సోనాలుచెట్టును పెంచుతారు. ఇది ఇతరత్రాకూడా ఉపయోగ పడుతుంది. సోనాలు చెక్క గట్టిగా వుంటుంది; బాగా మన్నుతుంది. కొన్ని కొండజాతులవారు దీనిపూలను తింటారు. కాయలోని గుజ్జును విరేచనకారిగా వాడుతారు. వ్రేళ్లను 'టానిక్' గాను, జ్వరౌషధంగాను వాడుతారు. దీని ఓషధీ గుణాలు కారణంగా సోనాలుచెట్టు అనేకరకాల హింసకు గురిఅవుతుంది. ఈచెట్టు బెరడును కోసి తీసివేసినచోట్ల వికారమైన పుండ్లవంటివి ఏర్పడుతాయి; వాటితో వున్న ఈ అందాల తరువును చూడ కష్టంగా వుంటుంది. మన పట్టణాలలో వీధులవెంబడి పెంచే చెట్ల కిటువంటి బాధలు తప్పవుకదా !

## 11. సరుగు

*CASUARINA EQUISETIFOLIA* Forst

***Family :*** Casuarinaceae

ఇంగ్లీషు పేర్లు: **CASUARINA, BEEFWOOD TREE**

సరుగునే 'సరుగుడు' 'చవుక' అనికూడా అంటారు.

ఇది చిట్టగాంగ్‌నుండి గల కోస్తాప్రాంతానికి చెందినది. సరుగు అక్కడేకాక తూర్పున హిందూమహాసముద్రంలోని ద్వీపాలకు, పసిఫిక్ ద్వీపాలకు, ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్‌కూ కూడా స్వతస్సిద్ధంగా చెందినది. భారతదేశంలోని

అనేక కోస్తాజిల్లాలలో సరుగును పెంచుతున్నారు. 1798 లో 'ఫ్రాన్సిస్ హామిల్టన్' దీనిని చిట్టగాంగ్‌నుండి తెచ్చి కలకత్తాలోని 'బొటానికల్ గార్డెన్'లో పెంచాడు. ఉత్తరకనరాలోను, తూర్పుకోస్తాలో మద్రాసునుండి పూరిదాక, పడమటి కోస్తాలో రత్నగిరినుండి బొంబాయివైపు ఉత్తరంగాను సరుగును విరివిగా పెంచు తున్నారు. 'ఈక్విసెటిఫోలియా' అనగా 'గుర్రపుతోకవంటి ఆకులు కలది' అని భావము. 'కాషూరినా' అన్న పదం, ఈ చెట్టుకొమ్మలకూ ఈకలకూ గల పోలి కను సూచిస్తుంది. సరుగుచెట్టు బెరడును తీసివేయగా ఎర్రగా 'గోమాంసం' వలె కన్పించే చెక్క కారణంగా దీనికి 'బీఫ్‌వుడ్' అన్న ఆస్ట్రేలియా పేరు వచ్చింది.

## వర్ణన

సరుగుచెట్టు సతతహరితమైనది. అతిత్వరగా 30 మీటర్లు లేక అంతకన్న ఎక్కువ ఎత్తుకు పెరుగుతుంది. లావుగావుండే దీనికొమ్మలు, చిన్నచిన్న కొమ్మ లుగా విస్తరిల్లుతాయి. ఈ చిన్నకొమ్మల మీదగల కణుపులవద్ద సన్నటి పుల్లల వంటివి వుంటాయి; ఇవి ఆకులన్నమాట. చూడడానికి సరుగుచెట్టు దేవదారుజాతి చెట్టువలె ఉంటుంది. కాని దేవదారుజాతిచెట్ల ఆకులు సరుగుచెట్టాకుల కన్న చిన్న విగా వుంటాయి. బాగా చిన్నవిగా ఉండే దీని పూవులు ఏకలింగకములు. మగ పువ్వులు రెమ్మలచివర గొట్టాకారపు నికివి కంకులుగా పూస్తాయి. ఒక్కొక్క పువ్వులోను ఒక కేసరము, రెండు 'పోగు'లు వుంటాయి. ఆడపువ్వులు చిన్న విగా గుండ్రటి 'గోపురా' కారంలో వుంటాయి. ఈ 'గోపురా'లు ముదిరి చెక్కలా అవుతాయి. విత్తనాలకు 'రెక్కలు' వుంటాయి. విత్తనాలు లెక్కలేనన్ని వుంటాయి

## ఉపయోగములు

సరుగుచెక్క గట్టిగానే వుంటుంది కాని ఈ దేశంలో దీనిని కుర్చీలు మొద లయిన వాటిని చేయడానికి వాడరు. స్తంభాలుగా, వాసాలుగా ఇది అత్యంత ఉప యోగకరమైనది. వంటచెఱకుగా సరుగు శ్రేష్ఠమైనది. సముద్రతీరప్రాంతాలలో నేలను సాగు కనువుగా చేయడానికి, ఆ ప్రాంతాలలో గాలివేగాన్ని అడ్డడానికి

సరుగుడుచెట్లు సాయపడతాయి. ఇవి పెంచిన కొద్దికాలం తర్వాత ఆ ప్రాంతంలో క్రమంగా ఇతరచెట్లను పెంచవచ్చును. బెంథాల్ తన 'ట్రీస్ ఆఫ్ కలకత్తా' అన్న పుస్తకంలో ఇట్లా వ్రాశాడు: "దీని సన్నటిఆకుల, రెమ్మలగుండా గాలి వీస్తుండగా విన్పించే శబ్దం దూరాన సముద్రపుహోరువలె అన్పిస్తుంది; దీని ఆకుల లేతరంగుకూడా మిగతా ఉష్ణమండలపు చెట్ల ఆకుల రంగుకన్న భిన్నంగా వుంటుంది." ఎందుచేతనోకాని పక్షులు సరుగుడుచెట్లు నాశ్రయించవు. కనుక మీ తోటలో పక్షుల కలకలారవము వినపడాలంటే సరుగుడుతోబాటు ఇతరచెట్లనూ నాటి పెంచండి.

## పెంపకము

నీటిముంపులేని చోట నారుమడిని సిద్ధంచేసి క్రొత్త విత్తనాలను చల్లండి. బంకమట్టి నేలలు విత్తడానికి పనికిరావు. ఏడాది వయసు మొక్కలను నారు మడి నుండి పీకి, నాటవచ్చును. సరుగుకు నీడ ఏమాత్రమూ పనికిరాదు గనుక ఈ మొక్కలను బాగా వెలుతురు తగిలేచోట నాటాలి. పదేళ్ల తర్వాత వీటినుండి కఱ్ఱ కొట్టి తీసుకోవచ్చును; యాభైఏళ్లు నిండకముందే సరుగుచెట్లను కొట్టి వేయాలి. వయసు ఎక్కువయిన చెట్లకు ఒక శిలీంధ్ర సంబంధమైన వ్యాధి సంక్రమిస్తుంది; ఆ వ్యాధివలన జలనాళాలు మూసుకుపోగా, చెట్టు ప్రాను వికృతంగా అయి, ఆఖరుకు చనిపోతుంది. సరుగు ముఖ్యంగా సముద్రతీర ప్రాంతవాసియే అయినప్పటికీ ద్వీపకల్ప భారతదేశంలో దీనిని చాల నగరా లలో వీధిప్రక్కల పెంచుతున్నారు.

కాని సరుగుడుయొక్క హొయలు, ఠీవీ చూడాలంటే భారతదేశంలోని సముద్రప్రాంతాలకు వెళ్లవలసిందే।

# 12. ఇరుగుడు

*DALBERGIA LATIFOLIA* Roxb

*Family :* Papilionaceae

ఇంగ్లీషు పేర్లు: **BOMBAY ROSEWOOD, BOMBAY BLACKWOOD, SHISHAM**

ఇరుగుడి, ఇరుడుచేవ, ఇరుగుడుచేవ, ఇరువుడు, చిట్టెగి, జిట్టెగి.
జిట్రేగి—అన్నవి ఇరుగుడుయొక్క ఇతర పేర్లు.

## పేర్లు

18-వ శతాబ్దపు ఉత్తరార్ధంనుండి 19-వ శతాబ్దపు ప్రారంభందాక జీవించిన స్వీడిష్ వృక్షశాస్త్రవేత్త ఎన్. డాల్బెర్గ్ యొక్క స్మృతిసూచకంగా ఏర్పడినదే 'డాల్బెర్గియా' అన్న గణనామము. 'లాటిఫోలియా' అనగా వెడల్పాటి ఆకులు గలదని భావం.

## వ్యాప్తి

హిమాలయ పాదశ్రేణికి చెందిన ఇరుగుడు అక్కడినుండి మధ్య, దక్షిణ భారతదేశాలకు వ్యాపించింది. ఇది కొండప్రాంతాలలో 1500 మీటర్ల ఎత్తుదాక కనపడుతుంది. మధ్య, దక్షిణ దేశాలలో ఆకులు రాల్చే చెట్లున్న అడవులలో ఇరుగుడు పొట్టిగా 10 మీటర్లకన్న తక్కువ ఎత్తుకు, ఎగుడుదిగుడుగా పెరుగుతుంది. దక్షిణాదివి ఆర్ద్రప్రాంతాలలో ఇది ఎపుగా 25 మీటర్ల ఎత్తువరకు పెరుగుతుంది; 35 మీటర్ల ఎత్తుకు పెరిగిన చెట్లూ వున్నాయి.

## వర్ణన

ఇరుగుడు స్వల్ప పరిమాణంనుండి మధ్య పరిమాణందాకా పెరిగేచెట్టు. దీని కొమ్మలు బాగా విస్తరించడంవలన, ఇది బాగా పీడవిస్తుంది. ఇది ఆకులు రాల్చు

తుంది కాని ఎప్పుడూకూడా బొత్తిగా ఆకులులేకుండా వుండదు. శీతాకాలపు చివరి దినాలలో ఇది ఆకులను రాలుస్తుంది. ఇరుగుడుఆకు భిన్నపత్రము; మధ్యఈనెకు ఇటూ అటూ 5-7 ఉపదళాలు మరచుట్టు ప్రసారంలో వుంటాయి. ఈ ఉపదళాలు ఇంచుమించు వర్తులంగా, స్థిరంగా, పైన ఆకుపచ్చగా, క్రింద కాస్త పాలిసట్లుగా ఉంటాయి. ఇరుగుడు పూవులు కానుగ పూవులవలె వుంటాయి. ఇరుగుడు పువ్వులు ఆకుల చంకలలో వదులుగుత్తులుగా పూస్తాయి. నక్షత్రాకారంగా, బల్ల వరుపుగా, 1-3 గింజలు కలిగివుండే దీనికాయ ఏకవిదారకము. వేసవిలో ఇది పూతపూస్తుంది; దీనికాయలు వర్షాకాలారంభందాక చెట్టున వుంటాయి.

## ఉపయోగములు

మనదేశంలో లభ్యమయ్యే మేలిరకపు కలపలలో ఇరుగుడు ఒక్కటి. దీనిని (ఇండియన్) బొంబాయి రోజ్‌వుడ్ లేక బ్లాక్‌వుడ్ అంటారు. 'ఇండియన్ ఫారెస్టర్' పత్రికలో ఇటీవల వ్రాస్తూ డి. జి. వెస్లీ ఇట్లా వ్రాశాడు. ''63.7 ఘనపు అడుగుల ఇరుగుడు మొద్దుకు 23059·40 రూపాయలు వచ్చాయి; అనగా ఒక ఘనపుటడుగు ఇరుగుడు కలపధర 362 రూపాయలన్నమాట. నేటివరకు ఇంత హెచ్చుధర పలికిన కలప ఈ దేశంలో ఇంకొకటి లేదు.'' ఇరుగుడు కలప గురించి తన 'డిక్షనరీ ఆఫ్ ఎకనామిక్ ప్రాడక్ట్స్'లో జి. వాట్ — ''ఇరుగుడు కలప భారతదేశమందలి అతి విలువకలిగిన కలపలలో నొక్కటి. ఇది గట్టిగా, బలంగా చిక్కటి కణములు కలిగి, ధూమ్రవర్ణం కలిపిన నలుపురంగులో వుంటుంది. దీనిని పాలిష్ చేసినకొద్దీ అందం హెచ్చుతుంది. మేజాలు, కుర్చీలు మొదలయిన వాటిని చేయడానికిది అత్యుత్తమమైనది''.

## పెంపకము

నీరు బాగా వడిసేటువంటి నారు మళ్లలో తాజా విత్తనాలను నాటండి. తాజా విత్తనాలు నాటితేనే మొలకలు బాగా వస్తాయి. ఈ నారుమొక్కలను వర్షర్తు ప్రారంభంలో తీసి నాటాలి. వీటిని మొదట కొద్దిపాటి నీడలోవుంచి, తర్వాత వెలుతురు బాగా తగిలేటట్టు చేయాలి. నీరు వడిసే అర్ద్రభూములలో ఇరుగుడు

చక్కగా పెరుగుతుంది. కాని సారహీనమైన బెట్టనేలలలోకూడా ఇది పెరగ గలదు. వీధుల ప్రక్కల ఇరుగుడు బాగానే పెరుగుతుంది. కాని ఆకులు రాలి వుండగా ఇది చూడడానికి బాగుండదు.

## 13. ఎఱ్ఱతురాయి

*DELONIX REGIA* Raf

*Family :* Caesalpiniaceae

ఇంగ్లీషు పేర్లు : **FLAMBOYANT; ROYAL PEACOCK FLOWER; GUL MOHUR; FIRE TREE; PENTECOST TREE; HOLY GHOST TREE**

ఎఱ్ఱతురాయినే ఇంకా ఎన్నో పేర్లతో పిలుస్తారు. ఆ పేర్లు తురాయి, పెద్ద తురాయి, పెద్ద సెరిబిసెరి, సీమసుంకేశ్వరము*

వర్షాలు ఇక వస్తాయి అనగా వేసవిలో మన నగరవీధులలో ఎఱ్ఱతురాయి విరగబడి పూస్తుంది; ఆపుదు వీధులకు వీధులే అగ్నిజ్వాలలవలె వెలుగు తుంటాయి. ద్వీపకల్ప భారతదేశంలో వీధులప్రక్కల పెంచే అతిసుందరమైన చెట్లలో ఎఱ్ఱతురాయి ఒక్కటి.

---

* Delonix Regia నే Poinciana Regia Boj అని కూడా నిర్వచిస్తారు.

Poinciana Elata - (White Go'd Mohur) చిన్న సెరిబిసెరి, చిట్టికేశ్వరము, సుంకేశ్వరము, వాతనారాయణ.

Caesalpinia Pulcherrima - False Peacock Flower చిన్నతురాయి, పమిడికంగేడు, రత్నగ్రంథి. - అను॥

## పేర్లు

ఎర్రతురాయి శాస్త్రీయనామము 'డెలోనిక్స్ రీజియా' కాగా కొన్ని పాతపుస్తకాలలో 'పాయాన్నియానా రీజియా' అని వుంటుంది. 'డెలోనిక్స్' అనగా 'స్పష్టమైన గోరుకలది' అని తాత్పర్యము. దీనిని ఇంగ్లీషులో "పీకాక్ ఫ్లవర్" (నెమలిపువ్వు) అంటారు; బహూశా ఈ చెట్టుయొక్క హిందీ పేరయిన "గుల్ మొహర్" ఇంగ్లీషు పేరునుండే వచ్చివుంటుంది. హిందీలో 'గుల్' అనగా 'పువ్వు' ; 'మోర్' అనగా 'నెమలి' అనీ అర్థం. 'మోర్' కొంచెం మార్పు చెంది 'మొహర్' అయివుండవచ్చునంటారు. ఎర్రతురాయిచెట్టు 'ఈస్టర్' పండుగ జరిగిన 50 రోజుల తర్వాత 'పెంటికోస్టు' పర్వపుకాలంలో నుంచి పూతమీద వుంటుంది. ఆ కారణంగానే దీనిని బొంబాయిలో క్రైస్తవులు "పెంటెకోస్ట చెట్టు" అనీ 'హోలీఘోస్ట్ చెట్టు' అనీ పిలుస్తారు.

### ఆదిమ నివాసము

ఎర్రతురాయి జన్మస్థలము మడగాస్కర్. అక్కడినుండి 19-వ శతాబ్దిలో ఇది మారిషస్ చేరింది. మరి ఇది మన దేశంలోకి ఎప్పుడువచ్చింది నిర్ధారణ కాలేదు. 1845 లో తాను తయారుచేసిన "కేటలాగ్ ఆఫ్ బొటానికల్ గార్డెన్ ఆఫ్ కలకత్తా"లో వాల్ష్ - 'ఎర్రతురాయి వర్షాకాలంలో పువ్వులు పూస్తుంది' అని మాత్రమే పేర్కొన్నారు. 1850 లో ఈ చెట్టు బొంబాయిలో పెరుగుతుండేదన డానికి తగు ఆధారాలున్నాయి. ఇప్పు డిది మన నగరాలన్నిటా కానవస్తుంది.

### పెంపకము

ఇది మధ్య పరిమాణంలో వుంటుంది. వయస్సునుబట్టి, నేల రకాన్నిబట్టి ఎర్రతురాయి 5-10 మీటర్ల ఎత్తువరకు పెరుగుతుంది. ఇది వివిధరకాల నేలలలో, వివిధశీతోష్ణ పరిస్థితులలో పెరగగలదు. సముద్రతీరాన ఎంత ఏపుగా పెరుగుతుందో బెట్టప్రాంతాలలోను అంతఏపుగా పెరుగుతుంది. దీని వేళ్లు ఎక్కువ లోతుకు చొచ్చుకుపోవు: బాగా విస్తరిస్తాయి. కనుక ఇది తోటలో పెంచడానికి పనికిరాదు. ఎందుకంటే దీని చుట్టుప్రక్కల ఇం కేచెట్టూ పెరగలేదు. కాని శిలా

మయమైన నేలలో ఎర్రతురాయి బాగా పెరుగుతుంది. అయితే ఎక్కువలోతుకు పోని వేళ్ల కారణంగా, వర్షాకాలంలో పెనుగాలులు వీచినప్పుడు ఇది విరిగి పడి పోయే ప్రమాదం వుంది. ఎర్రతురాయి త్వరితంగా పెరుగుతుంది; శాఖోపశాఖలుగా గొడుగువలె విస్తరిస్తుంది. పువ్వుల నిమిత్తమయినా, నీడ నిమిత్తమయినా ఎర్రతురాయి వీధుల ప్రక్కలలో పెంచదగినది.

## వర్ణన

దీని ఆకులు అందమైన ఈకలవలె, కంటి కింపయిన లేతాకు పచ్చరంగులో ఉంటాయి. ఆకు 60 సెంటిమీటర్ల పొడవునకూడా వుంటుంది. ఇది ద్విన్న పత్రము; దీనిలో మధ్య ఈనె కిరువైపుల 10-20 జతల శాఖలుంటాయి. ఈ శాఖల కిరుప్రక్కల 20-30 జతల లేతాకు పచ్చరంగు ఉపదళాలుంటాయి. పూతపూచే ముందుగా అనగా ఫిబ్రవరి మధ్యనుండి మార్చి మొదటివారంలోగా ఆకులన్నీ రాలిపోతాయి. ఇట్లా ఒక్క ఆకుకూడా లేకుండా ఉన్నప్పుడు పువ్వులు పుంఖాను పుంఖాలుగా వస్తాయి. అప్పుడు దీనినిచూస్తే నిజంగా "నిప్పుచెట్టు" (ఫైర్‌ట్రీ) అనిపిస్తుంది. పువ్వులు కొమ్మలచివర విడివి గెలలుగా పూస్తాయి. ఒక్కొక్క పువ్వు 10-12 సెంటిమీటర్ల వెడల్పున వుంటుంది. పువ్వులో అయిదు ఆకర్ష దళాలుంటాయి. వీటిలో నాలుగు, సింధూరపు రంగులో వుంటాయి; అయిదవది (పతాకదళము) కాస్త పెద్దదిగా, ఎరుపు పసుపురంగులలో వుంటుంది. ఈ దళాలన్నీ చెంచాల ఆకారంలో వుంటాయి. వీటి అంచులు ముడుతలుపడి వుంటాయి. దీని మొదలు సన్నగా, పొడుగ్గా, జంతువుల గోరువలె వుంటుంది; దీనినిబట్టే 'డెలోనిక్స్' అన్న పేరువచ్చింది. మొగ్గగా వున్నప్పుడు దానిని లేతాకుపచ్చ రంగులోవున్న రక్షకపత్రావళి కప్పివుంటుంది. పువ్వు వికసించాక రక్షకపత్రాల లోపలివైపు సింధూరపు వర్ణంలో వుంటుంది. పువ్వులో పది సన్నటి కేసరము లుంటాయి. ఈ కేసరములు వివిధ పరిమాణాలలో వుంటాయి. ఇవి ఎర్రగాను, పుప్పొడితిత్తులు పసుపుగాను వుంటాయి. దీని కాయ పెద్దది. 60 సెంటిమీటర్ల పొడవున, 5-8 సెంటిమీటర్ల వెడల్పున, 1-1·5 సెంటిమీటర్ల మందాన వుంటుంది. ఇది మొదట ఆకుపచ్చగా మెత్తగా వుంటుంది. తర్వాత ముదురు గోధుమరంగు

లోకి మారి గట్టిపడుతుంది. దీర్ఘచతురస్రాకారంలో ఉన్న గింజమీద మచ్చ లుంటాయి. ఎర్రతురాయిచెక్క తెల్లగా, తేలికగా ఉంటుంది. దీనిని పాలిష్ చేసిన కొద్దీ అందంగా ఉంటుంది.

## 14. లంపటి

*DUABANGA GRANDIFLORA* Walp

*Family :* Sonneratiaceae

ఇంగ్లీషు పేర్లు : **DUABANGA**

లంపటియొక్క గణనామమయిన 'దువాబంగా' అన్నదానిని త్రిపురలో ఈమొక్క పేరైన 'దూయబంగ్గా' ఆధారంగా ఫ్రాన్సిస్ హేమిల్టన్ నిర్ణయించాడు. 'గ్రాండిఫోరా' అనగా 'పెద్దపువ్వులుగలది' అని అర్థం. 'దువాబంగాగ్రాండిఫ్లోరా'నే ఇంతకు మునుపటి సాహిత్యంలో 'దువాబంగా సోన్నెరటియైడ్స్' అని పేర్కొనే వారు.

లంపటి పొడుగైనచెట్టు; ఇది త్వరగా పెరుగుతుంది. ఇది తూర్పుహిమాలయా లకు, దక్షిణాన అస్సాం, బర్మా, అండమానుద్వీపాలు, మలేషియా మొదలయిన ప్రాంతాలకీ చెందినది. సముద్రమట్టానికి పైన 1000 మీటర్ల ఎత్తువరకూ లంపటి పెరుగుతుంది. క్రింది హిమాలయలోయలలోని నదీతీరాలమీద లంపటి కనపడు తుంది. దాని స్వతస్సిద్ధమైన నివాసస్థలాలలో లంపటి 30 మీటర్ల పొడవున పెరుగుతుంది. త్వరితంగా పెరుగుతుంది గనుక ఇటీవల కొన్ని సంవత్సరాలలో దీనిని మనదేశంలో చాల ప్రాంతాలలో పెంచడం మొదలుపెట్టారు.

## వర్ణన

దీని లేత గోధుమరంగుమాను నిటారుగా వుంటుంది. దీని మ్రానుమీద ఒకే చోటనుండి ఎన్నోకొమ్మలు బయలుదేరి అడ్డంగా పెరుగుతాయి. లేతకొమ్మలు నూగు లేకుండా, సున్నగా, నాలుగు పలకలుగా వుంటుంది. దీని ఆకులు లేతగా వున్నవ్వు దెర్రగా వుంటాయి. ఆకులు ఎదురెదురుగా, కొమ్మకు ఇటువైపు ఒక వరుస, అటొక వరుస చొప్పున వుంటాయి. 25 సెంటిమీటర్ల పొడవు, 10 సెంటిమీటర్ల వెడల్పుగల దీనిఆకులు పైన మెరుస్తూ వుంటాయి. క్రింద మంద కొరిగా వుంటాయి. ఆకారం వర్తులం. పువ్వులు ఆకుల చంకలలో, రెమ్మలచివర చిన్న గుత్తులుగా పూస్తాయి. ఒక్కొక్కపువ్వు 5-7 సెంటిమీటర్ల వెడల్పున వుంటుంది. తెల్లటి ఈ పువ్వు వాసన బాగుండదు. దీని రక్షకపత్రావళి దళసరిగా, గంట ఆకారంలో ఉంటుంది. అది వీడి పడిపోదు. పై అంచున ఆరుభాగాలుగా వుంటుంది. ఆకర్షకపత్రాలు ఆరుంటాయి: ఇవి త్వరగా రాలిపోతాయి. కేసరములు అసంఖ్యాకంగా ఉంటాయి. కాయ తోలుతో చేసినదానివలె వుంటుంది. ఇది బహు విదారణఫలము (కాప్స్యూల్). ఇది చిన్న నారింజపండు పరిమాణంలో వుంటుంది. దీనిలోపల విత్తనాలు ఎన్నో వుంటాయి.

## పెంపకము

విత్తనాలద్వారా ప్రవర్ధనం సాగించడం సులభమే కాని విత్తనాలను నారు మడిలోనాటి మొలకెత్తించి, ఆ మొక్కలను వర్షాకాల ప్రారంభంలో నాటడంద్వారా సత్ఫలితాలను సాధించవచ్చును. లంపటి పెరిగేటువంటి వేగం ఆశ్చర్యకరంగా వుంటుంది. ఇంతకుముందరి బొంబాయిరాష్ట్రపు దక్షిణానవున్న అడవిలో ఒక చోట పరిశోధనాత్మకంగా పెంచిన లంపటిని నేను చూశాను. అయిదేళ్లక్రింద నాటబడిన ఆ చెట్లు 8 మీటర్ల ఎత్తుకు పెరిగాయి. దీని చెక్క మెత్తగా వుంటుంది. తూర్పు భారతదేశంలో లంపటి చెక్కతో తేయాకుని 'ప్యాక్' చేసే పెట్టెలు తయారుచేస్తారు. అగ్గిపుల్లల తయారీకికూడా ఇది పనికి వస్తుందంటారు.

అస్సాము, సిక్కిములలో వాగులఒడ్డున లంపటిచెట్లు కనపడతాయి. కలిం పాంగ్ దిగువగా, తీస్తానది తీరాన లంపటి విశేషంగా పెరుగుతుంది. అక్కడి

అడవిచెట్లలోని పెద్దవాటిలో లంపటి ఒక్కటి. మ్రాను కిటూ అటూ అడ్డంగా, సమానాంతరంగా పెరిగిన కొమ్మలు, ఆ కొమ్మలనుండి వ్రేలాడే పళ్లగుత్తులు— లంపటికొక గంభీరమైన అందాన్నిస్తాయి. కలకత్తాలోని 'ఇండియన్ బొటానికల్ గార్డెన్'లోకి 1801 లో లంపటిని ప్రవేశపెట్టారని సాక్ష్యం చెబుతుంది. కలకత్తాలో లంపటి ఇంకా పెరుగుతూంది. కాని మొదట నాటిన చెట్లలో ఒక్కటికూడా లేదు.

## 15. బాడిస

*ERYTHRINA INDICA* Lamk

*Family :* Papilionaceae

ఆంగ్లము పేర్లు : **INDIAN CORAL TREE**

**బాడిసనే బాడిత అనీ బాడిద అనీ, బారిదము అనీ రోహిణము అనీ**

ముచ్చికర్ర అనీ పారిభద్రకము అనీ, పారిభవ్యము అనీ, అంటారు.

భారతదేశపు ద్వీపకల్ప భాగంలో ముఖ్యంగా కోస్తాప్రాంతాలకు చెందిన అతి రమణీయమైన చెట్లలో ఒక్కటి బాడిద. ఇది మార్చి ప్రారంభంలో పూత మొదలుపెడుతుంది, పగడాలవంటి ఈ ఎర్రపూలు ఏప్రిలు, మేనెలలదాక వుంటాయి. పువ్వులు పూచాక ఆకులు మొలుస్తాయి. ఈ ఆకులు చలికాలందాక వుంటాయి. ఆ కారణంచేత ఇది నీడనిచ్చే ఉత్తమమైన చెట్లలో ఒకటిగా పరిగణింపబడుతుంది.

### గాథలు

బాడిద ఇంద్రుడి నందనమున పువ్వులు పూస్తుందని హిందూ పురాణాలు చెబుతాయి. దీని ఆకులోని మూడు ఉపదళాలూ త్రిమూర్తులను సూచిస్తాయని

అంటారు. వీటిలో మధ్య ఉపదళం విష్ణువును, కుడి ఉపదళం బ్రహ్మను, ఎడమ ఉపదళం శివుడిని సూచిస్తాయంటారు. భారతదేశంలోని తొలిక్రైస్తవులు దీనిని మూర్తిత్రయానికి (ట్రినిటీ)[1] సూచకంగా భావించారు; ఐర్లండులో సెయింట్ పేట్రిక్ శిష్యులకు 'షేమ్రాక్' అన్న త్రిదళపత్రంవలె ఈ క్రైస్తవులకు ఈ పత్రం ముఖ్యమైనది. పోర్చుగీసు వారీ ఆకులను 'ట్రినిదాద్ పుష్ప' అంటారు.

## వర్ణన

బాదిద సుమారైన ఎత్తుకు పెరుగుతుంది. సారవంతమైన నేలలలో 15 మీటర్లు లేక అంతకన్న ఎక్కువ ఎత్తుకుకూడా పెరుగుతుంది. చెట్టుయొక్క పిన్నవయసున కొమ్మలమీద ముళ్లుంటాయి. ఆకులు పెద్దగా మధ్య పొడుగాటి తొడిమెతో, మూడు ఉపదళాలతో వుంటాయి. ఉపదళం కోడిగ్రుడ్డు ఆకారంలో వుంటుంది. ఇది ఎంత వెడల్పుంటుందో అంతే పొడవుంటుంది. ఉపదళం చివర కొనదేలి వుంటుంది. మొదలు వర్తులంగా వుంటుంది. మధ్య ఉపదళం ప్రక్కవాటికన్న పెద్దదిగా వుంటుంది. ఆకులు బొత్తిగా లేనప్పుడు, అనగా ఫిబ్రవరి మాసాంతానగాని మార్చి మొదటగాని పూస్తాయి. ఈ పుష్పాలు రెండుమూడు నెలలదాక వుంటాయి. కొమ్మలచివర నిడివికంకులుగా పూవులు పూస్తాయి. ఒకే కొమ్మకు ఎన్నో పూల కంకులుంటాయి. పుష్పాలు మంచి ఎరుపురంగులో వుంటాయి. ఆకర్షకపత్రావళి చుట్టూ కవచంవలె అమరివున్న దీని రక్షకపత్రావళికూడా ఎర్రగా వుంటుంది. పుష్ప విచ్చుకోగానే రక్షకపత్రావళి నిలువునా చీలుతుంది. ఉన్న అయిదు ఆకర్షకపత్రాలలో పతాకదళం బాగా పెద్దగా వుంటుంది. కేసరములు పది వుంటాయి. ఇవి బాగా పొడుగైనవి; ఆకర్షక పత్రావళినుండి ఈ కేసరాలు బాగా బయటకువచ్చి వుంటాయి. ఇవికూడా ఎరుపురంగులోనే వుంటాయి. కాయ బలిష్ఠంగా మొదట ఆకుపచ్చగా, తర్వాత ముదురు గోధుమరంగులో (లేక నలుపుగా) వుంటుంది. ఈ కాయ మొదలు వద్దా, చివరా కొనదేలి, మధ్య గింజలున్న చోట ఉబ్బి వుంటుంది. ఒక కాయలో 12 నున్నటి, వర్తులాకారపు గింజలుంటాయి. ఆకులు చెట్టుమీద వున్నంతకాలము కాయలూ వుంటాయి.

---

[1] ట్రినిటీ : దేవుడు, జీససు, పవిత్రఆత్మ—అను ॥

## పెంపకము

వి త్తనాలద్వారాగాని, శాఖాప్రవర్ధనంద్వారాగాని బాడిసను పెంచవచ్చును. సాధారణంగా 1-1·5 మీటర్ల పొడవు, 10 సెంటీమీటర్ల మందమూ వున్న కాండపు ముక్కలనుగాని కొమ్మల ముక్కలనుగాని వర్షాకాలానికి కొద్దిగా ముందుగా నాటుతారు. ఇట్లా నాటేటప్పుడు ఆ ముక్కల 'ధృవాభిముఖత'ను పాటించాలి; అనగా ఈ ముక్కలు చెట్టుమీద ఉండగా వాటి పై కొన ఏదో, క్రిందికొన ఏదో వాటిని నాటినప్పుడూ ఆవిధంగానే వుండాలి; పై కొన గాలిలోకి క్రింది కొన నేలలోకి వుండేటట్లు ముక్కలను నాటాలి. చెట్టుకు కావలసిన పోషకరసాలు ఒకదిశనే, అనగా క్రిందినుండి పైకి ప్రవహిస్తాయి. దీనినే 'ధృవాభిముఖత' అంటారు. వానలు పడగానే ఈ ముక్కల పై కొనను ఆకులూ, క్రిందికొనను వేళ్లూ వస్తాయి. నేను బాడిసకర్రలను పాతి వాటికి ముళ్ల ఇనుపతీగెను కట్టిన కంచెలను చూచాను. వేసవిలో అది మామూలు కంచెవలెనే వుండేది. కాని వర్షాలు రాగానే బాడిసకర్రలు వేళ్లూని చిగిర్చాయి. కొన్ని రోజులకు కంచె అంతా ఈ మొక్కల ఆకులతో నిండిపోయింది. కంచె అందంగా తయారయింది. ఈ కంచె లోని ముళ్ల ఇనుపతీగె త్రుప్పుపట్టి తెగిపోయిన తర్వాతకూడా బాడిసమొక్కల ధర్మమా అని ఈ కంచె గట్టిగా వుంటుంది; ఈ మొక్కల కాండాలమీదవున్న ముళ్లు రక్షణ కల్గిస్తాయి.

వి త్తనాలద్వారా ప్రవర్ధనం కొనసాగించడం శ్రేష్ఠమే; కాని ఈ పద్ధతి వలన కాలహరణం జరుగుతుంది. కొమ్మలముక్కలు నాటగానే పెరిగే ఎత్తుకు, వి త్తనాల నాటాక వచ్చిన మొక్కలు పెరగడానికి ఒకటి రెండేళ్లు పడుతుంది.

పెనుగాలులు వీచేచోట గాలివేగాన్ని తగ్గించడానికి బాడిసచెట్లను నాటుతారు. కొన్నిచోట్ల తమలపాకుతీగ, ద్రాక్షతీగ, గుమ్మడితీగ, మల్లెతీగవంటివి ప్రాకడానికి ఆధారం నిమి త్తం బాడిసను పెంచుతారు. బాడిస 'లెగుమిన' జాతిచెట్టు గనుక దీని వ్రేళ్లు నేలలో నత్రజనిని తయారుచేసి దానిని సారవంతం చేస్తాయి. అందుకనే ముఖ్యంగా తేయాకు తోటలవంటి వాటిలో బాడిసచె ట్లను నాటి, తద్వారా తోటనుంచి అధిక దిగుబడి పొందుతారు.

'ఎరిత్రినోస్' లేక 'ఎరిత్రోస్' అన్నది గ్రీకుపదం: 'ఎరుపు'. 'పగడపు ఎరుపు' అని ఈ గ్రీకు పదానికి అర్థం. దీనినుండే బాడిసగణనామమయిన 'ఎరిత్రినా' వచ్చింది. 'ఇండికా' అన్న జాతి నామము బాడిస 'ఇండియా'కు చెందిన దనడం వలన వచ్చింది.

## 16. మఱ్ఱి

*FICUS BENGHALENSIS* Linn

*Family :* Moraceae

ఇంగ్లీషు పేరు : **THE BANYAN TREE**

మఱ్ఱినే పెద్దమఱ్ఱి, వటము, విటపి, భాండీరము, రోహి, వృక్షాదనము - అని అంటారు.

ఈ దేశంలో మఱ్ఱిచెట్టు నెరగని వారుండరు. కనుకనే దీనిని గురించి ఈపుస్తకంలో వ్రాయబూనడం సాహసమని మొదట అనిపించవచ్చును. కాని మఱ్ఱిని గురించి ప్రజలకు తెలియని ఎన్నో ఆసక్తికరమైన విషయాలున్నాయి గనుకనే దీనినిగురించి వ్రాయబూనుకున్నాను.

దీని ఇంగ్లీషు పేరయిన 'బన్యన్' ఎట్లా వచ్చిందో మొదట చెప్పాలి. పర్షియన్ సింధుశాఖ ప్రాంతంలో వుంటుండిన హిందూ 'బనియా'లు (వ్యాపారులు) - మఱ్ఱి జాతికిచెందిన ఒక చెట్టుక్రింద గుమిగూడి ప్రార్థన చేసేవారు; వ్యాపారసంబంధమైన విషయాలు మాట్లాడుకునేవారు. ఇది చూచిన అక్కడి యూరపియన్లు ఈ చెట్టుకు 'బన్యన్' చెట్టు అని పేరుపెట్టారని అంటారు. క్రమంగా ఈ పేరు ఈ అధ్యాయంలో పేర్కొన్న చెట్లజాతినే సూచించసాగింది; నాలుగు చెరగుల విస్తరించింది.

అనాదిగా కవులూ, శాస్త్రకులూ కూడా మఱ్ఱిని ప్రశంసిస్తూ రచనలు చేశారు. ఆధునికులూ మఱ్ఱిని గురించి రచనలు చేశారు. వారిలో ఒకరయిన 'నథే' కవి మఱ్ఱిని గురించి వ్రాసిన కవితలో ఒక భాగం క్రింద ఇస్తున్నాను.

"కోట అంతటా అల్లిబిల్లిగా
అల్లుకున్న ఆ గంభీరమైన చెట్టును -
ఎన్నో ఊడల ఆధారంగా
తలయెత్తి నిల్చున్న ఆ ముసలిచెట్టును -
భూగర్భంలోకి చొచ్చుకుపోవాలని
సూటిగా క్రిందకు దిగిన ఊడలుగల ఆ మఱ్ఱిని -
చూడ సుందరమైన ఆ మఱ్ఱిని
ఆలయమనిపించే - ఆ మఱ్ఱిని
చూడగానే భక్తితో మ్రొక్కి
ప్రార్థన చేయాలనిపిస్తున్నది."

## వ్యాప్తి

హిమాలయాల నిమ్నశ్రేణియందలి అడవులు, ద్వీపకల్ప భారతదేశమందలి కొన్ని కొండల చరియలు - మఱ్ఱియొక్క సహజనివాసములు. ఇప్పుడు మఱ్ఱిచెట్టు, వీధులప్రక్కన, యాత్రాస్థలాలలో, దేవాలయాలదగ్గిర, గ్రామాలలోని బయలుప్రదేశాలలో - విపరీతంగా కనబడుతుంటుంది. అసలు పేదతీర్చుకోవడానికయితేనేమి, కబుర్లకూ, కాలక్షేపానికీ అయితేనేమి, చర్చలు సమావేశాలు జరగడానికయితేనేమి మఱ్ఱిచెట్టు గ్రామపు రచ్చబండగా తయారవుతుంది. వేసవిలో దీని చల్లటినీడ ఎంతో ఆహ్లాదకరంగా వుంటుంది.

## వర్ణన

"ఇది చాల, చాల పెద్దచెట్టు; 70 నుండి 100 అడుగుల ఎత్తుదాక పెరుగుతుంది. దీని కొమ్మలనుండి వ్రేలాడే ఊడలు భూమిలోకి చొచ్చుకుపోయి వ్రేళ్లను తాకుతాయి; ఈ విధంగా ఈ చెట్టు విస్తరిస్తూ పోతుంది." అని తన "కలకత్తా రాయల్ బొటానికల్ గార్డెన్ చరిత్ర"లో సర్ జి. కింగ్ వ్రాశాడు. ఈ ఊడలు

మొదట సన్నగా, దారపుపోగులవలె వుంటాయి; కాని అవి నేలలోకి దిగాక లావుగా స్తంభాలవలె పెరిగి, బరువయిన కొమ్మల భారాన్ని మోయగల్గుతాయి. ఆకులు ఇంచుమించు కోడిగ్రుడ్డు ఆకారంలో, నున్నగా, మెరుస్తూ వుంటాయి. ఈ ఆకుల మొదలూ, కొనలూ కూడా వర్తులంగా వుంటాయి. ఇవి పైన ముదురాకు పచ్చగా, క్రింద కాస్త పాలినట్లుగా వుంటాయి. పువ్వులూ, కాయలూకూడా చాల సూక్ష్మమైనవి. ఇవి పుష్పపీఠంగాను,సంయుక్తఫలంగాను వుంటాయి. నిజానికి మఱ్ఱిపండు అన్నది పండుకాదు. అది ఒక సంయుక్తఫలము. ఈ సంయుక్తఫలం లోపల లెక్కలేనన్ని పండ్లుంటాయి. ఈ పంయుక్తఫలంలోపల వుండే చిన్న చిన్న గింజలవంటివే పండ్లన్నమాట. మఱ్ఱి 'పండ్లు' — ఆకు తొడిమెకు, కొమ్మకు, (లేదా కాండానికి) మధ్య వస్తాయి. ఇవి మొదట ఆకుపచ్చగా గట్టిగా వుంటాయి.



పటము 11. (అ) మఱ్ఱి

పక్వానికి రాగానే ఎర్రగా మెత్తగా అవుతాయి. ఈ పండ్లంటే పక్షులకు, కోతులకు అమితప్రీతి. ఈ పండ్ల వాసన బాగానే వుంటుంది కాని రుచి అంతగా బాగుండదు. అదీకాక వీటిలో పురుగులుంటాయి. కనుక సాధారణంగా మనుష్యులు వీటిని తినరు.

## గ్రామములో

గ్రామాలలోని వీధులు, నాల్గువీధుల కూడలి మున్నగుచోట్ల మఱ్ఱిని నాటు తారు. కాని మైదానాలలోను, బయలుప్రదేశాలలోను మఱ్ఱి తన విశ్వరూపం ధరి స్తుంది. మఱ్ఱిచెట్టు పెరిగినకొద్దీ దాని ఊడలు పెరుగుతాయి; క్రమక్రమంగా ఇది విస్తరించి, విస్తరించి ఏకంగా కొన్నివేలమందికి నీడనివ్వగలంత పెద్దదవుతుంది. మనదేశంలో సుప్రసిద్ధములైన మఱ్ఱిచెట్లు ఎన్నోఉన్నాయి. శిబ్‌పూర్ (కలకత్తా) లోని 'బొటానికల్ గార్డెన్'లోని ఒక మఱ్ఱిచెట్టు 1782 లో తాటిచెట్టుమీద పడిన ఒక మఱ్ఱివిత్తనంనుండి పుట్టింది. 1900 లో దీనిని వర్ణిస్తూ ప్రెయ్న్ ఈ క్రింది కొలతల నిచ్చారు: 'ప్రధాన కాండపు చుట్టుకొలత 15 మీటర్లు; ఊడలు 464; ఊడల చుట్టుకొలత కొన్ని సెంటీమీటర్ల నుండి 3·6 మీటర్ల వరకు. మొత్తం చెట్టుయొక్క పైభాగపు చుట్టుకొలత (కుంభపరిధి) 377 మీటర్లు.'' ఇదే చెట్టుకు 1965 లో 1044 ఊడలున్నాయి. అన్నివైపులా చిత్తం వచ్చినట్లు దీనిని విస్త రింప నివ్వలేదు. అప్పటికీ దీని పరిధి 416 మీటర్లకు పెరిగింది. ఇంతకన్న పెద్ద మఱ్ఱిచెట్టు ఒకటి సతారాకు (దక్షిణ మహారాష్ట్ర) కొద్దిదూరాన వుంది. 1882 లో దీని పరిధి 489 మీటర్లు; ఉత్తరంనుండి దక్షిణానికి పొడవు 181 మీటర్లు; తూర్పు పడమరల పొడవు 134 మీటర్లు.

బొంబాయివంటి అనేక నగరాలలో వీధులప్రక్కన మఱ్ఱిచెట్లు అసంఖ్యాకంగా కనపడతాయి. కాని ఇవి స్వేచ్ఛగా పెరగడానికి ఎన్నో ఆటంకాలున్నాయి. సాధార ణంగా పిల్లలు మఱ్ఱిఊడలను ఉయ్యాలలుగా వాడి, వాటిని పాడుచేస్తారు. వేస విలో పశువులు లేతమఱ్ఱిఊడలను తింటాయి. ఈ విధంగా ఈ ఊడలు నేలలోకి దిగజాలవు. నగరాలలోని కాంక్రీటు లేక తారురోడ్డులు మొదలయిన వాటి కారణంగా ఊడలకు అవరోధం కలుగుతుంది. ఇటువంటిచెట్లకు ఊడలవలన లభించవలసినంత ఊతం లభించదు. కనుక వీటి పైభాగపు బరువు ఎక్కువయి

వర్షాకాలంలో ఇవి విరిగి పడిపోతుంటాయి. బొంబాయిలోని మహాత్మాగాంధీరోడ్డు మీద గత కొన్ని సంవత్సరాలలో కొన్ని చక్కటి మఱ్ఱిచెట్లు ఇట్లా విరిగి కూలి పోయాయి.

గోడలమీద

మఱ్ఱివిత్తనాలు పక్షులద్వారానో, మరొక విధంగానో మన వూళ్ళల్లో ఏ గోడల మీదో పడతాయి. అక్కడ ఇవి అంకురిస్తాయి. ఆ తర్వాత చిత్రవిచిత్రమైన దృశ్యాలు కనపడతాయి. గోడలలోని పగుళ్లలోకి సందులలోకి, అమాయకంగా వుండే లేతవేళ్లు ప్రవేశించ నారంభిస్తాయి. క్రమంగా ఈ వేళ్లు లావెక్కుతాయి. అప్పుడిహ నెమ్మది నెమ్మదిగా గోడ పగల నారంభిస్తుంది. చివరకు ఆ గోడలు మరమ్మత్తుకూడా చేయరానివిగా అయిపోతాయి. ఈ విధంగానే మఱ్ఱిచెట్లవలన బొంబాయిదగ్గర కొన్ని పాతకోటల గోడలు బీటలువారుతున్నాయి.

భూగర్భంలో పెరిగే వేళ్లు

ఇండ్లున్నచోట మఱ్ఱిని పెంచడం అపాయకరం. మఱ్ఱిఊడలు సాధారణంగా నయితే నేలలోకి, సూటిగా క్రిందిదిశలో చొచ్చుకుపోతాయి. కాని చుట్టుప్రక్కల ఇండ్లుంటే వాటిక్రిందవున్న చల్లటి తడిమట్టి వైపుకు ఈ ఊడలవేళ్లు మళ్లుతాయి. మఱ్ఱివేళ్లవలన పునాదులే కదిలించబడిన ఇళ్లను నేను చూచాను. గచ్చు చేసిన వరండాలు మఱ్ఱివేళ్ల వలన పగిలి ఎగుడు దిగుడుగా అవడం నే నెరుగుదును. కనుక మీ ఇల్లు సురక్షితంగా వుండాలి అంటే ఆ సమీపంలో మఱ్ఱిచెట్టును పెంచకండి.

ఇతర చెట్లకు అపాయం

బొంబాయిదగ్గరి బోర్వీలిలోని జాతీయ ఉద్యానవనంలోగాని మనదేశంలో ఇం కెక్కడయినాగాని ఒక తాటిచెట్టు, మఱ్ఱియొక్క కొమ్మల, ఊడలనుండి పుట్టి పెరుగుతున్నట్లనిపించే దృశ్యాన్ని మీరు చూడవచ్చును. కాని ఇందులో అతిథి లేతమఱ్ఱిచెట్టుకాగా దానికి అమాయకపు ఈత (లేక తాడి) ఆశ్రయం ఇచ్చిందన్న

మాట. క్రమంగా అతిథి ఇంతై, ఇంతింతై, మరింతయై తనకు ఆశ్రయం ఇచ్చిన ఆ చెట్టును చుట్టుముట్టి, నులిమి చంపేస్తుంది.

కొన్ని మఱ్ఱివిత్తనాలు ఏ తాటిచెట్లుకాండం మీదనో పడవచ్చును. వానాకాలంలో ఆ విత్తనాలు మొలకెత్తగా, దారపుపోగులవంటి పిల్లవేళ్లు నేలవైపు సాగుతాయి. త్వరలోనే ఆ సన్న సన్నటివేళ్లు ఆ చెట్టుచుట్టూ ఒక వలగా ఏర్పడతాయి. ఆ పిదప ఆ మఱ్ఱివేళ్లు చాంతాళ్లయి, కర్రలయి, స్తంభాలయి ఆ తాటిచెట్టును నొక్కివేయ నారంభిస్తాయి. ఈ ఒత్తిడికి తాటిచెట్టులోపల వుండే (భూమిలోనించి చెట్టు పై భాగందాక నీటిని తీసుకుపోయే) వాహికలన్నీ నొక్కుకుపోయి, మూసుకుపోతాయి. ఇహ ఆ తాటిచెట్టు బ్రతకడం కష్టమయి, చివరకు చచ్చిపోతుంది. దాని ప్రధానమైన వేళ్లు నశించి మాయమయిపోతాయి. ఆఖరికి మఱ్ఱిఊడల చావు కౌగిలిలో మిగిలిన ఆస్థిపంజరం మాత్రమే మిగులుతుంది. అడవులలోకూడా మఱ్ఱి ఎన్నో ముఖ్యమైన ఇతర వృక్షాలకు తీరని హానిని కల్గిస్తుంది. కనుకనే అడవులలోకి మఱ్ఱిని అడుగుపెట్ట నివ్వకుండా అటవీసంరక్షణాధికారులు ప్రయత్నాలు చేస్తుంటారు.

మఱ్ఱినిగురించి 1832 లో విలియం రాక్స్‌బర్గ్—''ఈ పళ్లను పక్షులు తింటాయి, పక్షులు విసర్జించిన గింజలు మరింత బాగా అంకురించి పెరుగుతాయి. ఇవి గింజలు గనుక ఏ తాటిచెట్టు మట్టలలోనో పడి, మొలకెత్తి పెరగనారంభిస్తాయి. ఈ మఱ్ఱి చెట్టు పెరిగి తాటియొక్క పైభాగం మినహా అంతా ఆక్రమించి చుట్టివేస్తుంది. అప్పుడే వృక్షాలపెళ్లి జరిగిందని, ఇది దేవుడి చలవ అని భావించి హిందువులు గౌరవిస్తారు.''—అని వ్రాశాడు.

## 17. రావి

*FICUS RELIGIOSA* Linn

*Family :* Moraceae

ఆంగ్లపుపేరు : **THE PEEPAL TREE**

రావిచెట్టునే అశ్వత్థము అనికూడా అంటారు.

భారతదేశంలో అందరికీ చిరపరిచితమైన రావిచెట్టును గురించి వ్రాయబూనడం సాహసమే అవుతుంది. అనుకుంటూనే దీనిని వ్రాస్తున్నాను. రావిచెట్టులేని గ్రామమే వుండదంటే అతిశయోక్తి కాదు. ఈ చెట్టుపట్ల ప్రజలు భక్తిశ్రద్ధలు ప్రకటిస్తారు. హిందువులకూ, బౌద్ధులకూ కూడా ఇది పూజనీయమైనది. మనదేశపు జానపదగాథలు మర్రిచెట్టు పురుషుడనీ రావి 'అతడి' స్త్రీ అనీ భావిస్తాయి. ''రెలిజియోసా'' అన్న నిర్దిష్టనామం - ఈ చెట్టు ఇతోధికంగా దేవాలయాలవద్ద, పుణ్యస్థలాలవద్ద వుండడం కారణంగా ఏర్పడింది.

### వర్ణన

ఇది బృహత్ పరిమాణానికి పెరుగుతుంది. మనదేశపు చెట్లలో ఇది చాల పెద్దది. లేతవయసున ఇది ఇతరచెట్లమీద పెరుగుతుంది; త్రాళ్లవంటి దీనివేళ్ల మూలంగా ఆ చెట్టు క్రమంగా నొక్కి వేయబడి చనిపోతుంది. లేదా, రావి గోడం పగుళ్లలో నుండి పెరగనారంభిస్తుంది; క్రమంగా గోడలుపీలి చివరకు పడిపోతాయి. పశ్చిమభారతదేశంలోని పూలచెట్లమీద వ్రాసిన పుస్తకంలో నైర్న్ ''రావివంటి వినాశకరమైనచెట్టు మరొకటి లేదు'' అని వ్రాశాడు.

అయితే మర్రియొక్క ప్రత్యేకలక్షణమైన ఊడలు రావికి లేవు. ఆకులు, లేతకొమ్మలు నున్నగా, తళతళమంటూ వుంటాయి. ఆకు ఇంచుమించు కోడిగ్రుడ్డు ఆకారంలో, తోలువలె వుంటుంది. దీని మొదలు గుండెకాయ ఆకారంలో వుంటుంది.

చివర హఠాత్తుగా సన్నబడి, పొడుగాటి తోకవలె కొనదేలి వుంటుంది. ఆకు మధ్యఈనె బలిష్ఠంగా వుంటుంది. మధ్యఈనె కిటూ అటూ 5-9 పిల్లఈనె లుంటాయి. ఈ పిల్ల ఈనెలు ఆకు అంచున కలిసిపోయి ఒంపులు తిరుగుతుంది. ఆకులు వ్రేలాడుతుంటాయి. ఏమాత్రం గాలివీచినా ఆకులన్నీ గలగలమంటూ కదులు తాయి. అందుకనే కాలోలు రావికి 'చలదళము' అన్న పేరువచ్చింది। రోజంతా పొలంలో పనిచేసి అలిసిపోయినరైతు రావిచెట్టుక్రింద కూర్చుని, రావి ఆకుల తోలపాటవింటూ ఆదమరిచి నిద్రపోతున్న దృశ్యం ఎంత ప్రశాంతంగాఉంటుంది। ఆకు తొడిమెకూ కొమ్మకూ మధ్య పుష్పపీఠాలు జతలు జతలుగా వస్తాయి. ఇవి మొదట సన్నగా ఆకుపచ్చగా వుంటాయి; తర్వాత ధూమ్రవర్ణంగా మారుతాయి; ఇవి 12 మిల్లిమీటర్ల వెడల్పున వుంటాయి; ప్రతి పుష్పపీఠంలోను అగ్రావ చాల కొద్ది మగపుష్పాలుంటాయి. ప్రతి మగపుష్పంలోను ఒక కేసరము, మూడు చిన్న రంగులేని 'ఆకర్షకపత్రా' లుంటాయి; ఆడపువ్వులో అయిదు 'ఆకర్షకపత్రా'లూ వాటిమధ్య పుష్పగర్భమూ వుంటాయి. మర్రికివలెనే రావిదీ సంయుక్తఫలము. పండువలె కనపడేది అసలు పండుకాదు; దానిలోపల దాగిన అనేకానేక గింజల వంటివే అసలుపండ్లు. ఆ 'సంయుక్త ఫలా'న్ని తిన్నప్పుడు ఇవి పళ్లసందుల్లో ఇరుక్కుంటాయి. రావిపండ్లను పక్షులు ఇష్టంగా తింటాయి. పక్షుల రెట్టలలో ఈ గింజలు యథాతథంగా పడుతుంటాయి. తగినంత తేమ సమకూరగానే ఈ గింజలు మొలకెత్తుతాయి.

## రావి ఆయుస్సు

మిగతా చెట్లతో పోల్చితే రావి సుదీర్ఘమైన ఆయుస్సు కలదని ప్రతి గ్రామ వాసికీ తెలుసు. క్రీ.పూ. మూడవశతాబ్దంలో ఉత్తర భారతదేశంనుండి సింహళానికి తీసుకువెళ్లి నాటబడిన ఒక రావిచెట్టు గత శతాబ్దంలోకూడా వుంది; 1852 లో ఆ చెట్టువయసు 2147 సంవత్సరాలని చెప్పడానికి తగిన ఆధారాలున్నాయి. అప్ప టికి అది ప్రపంచంలో కెల్లా అతి వృద్ధ వృక్షమయి వుండాలి. సింహళంలో, ఆ రావిచెట్టు బ్రతికివున్నంతకాలం సింహళపాలకులవంశం అధికారంలోఉంటుంది అన్న సంప్రదాయం ఒకటి వుండేది; దానివలన అన్ని శతాబ్దాలపాటు ఆ చెట్టును అతి జాగ్రత్తగా సంరక్షించారు.



పటము. 11. (అ) మఱ్ఱి

(చూడు : పుట 49)



పటము. 13. రావి

(చూడు : పుట 35)

## పవిత్రవృక్షము

ఈ బోధి (రావి) చెట్టుక్రిందనే బుద్ధగయలో గౌతముడికి జ్ఞానోదయం కల్గిందంటారు. కాని దురదృష్టవశాత్తు ఇప్పుడా అసలు చెట్టులేదు; దానిస్థానే మరొక రావిచెట్టు ఉంది. హిందువులు అశ్వత్థవృక్షాన్ని పూజిస్తారు. అశ్వత్థం చెట్టునిగాని దాని కొమ్మలుగాని నరకడం పాపమని భావిస్తారు. నగరాలలో నయితే భవనాలకూ అడవులలో నయితే చెట్లకూ హాని కల్గిస్తున్నా సరే రావిచెట్టు నేమీ చేయరు. చేయనివ్వరు. రావిమొక్కను నాటిన వారిని "చల్లటి నీడనిచ్చే ఈ రావిని నాటాడు పుణ్యాత్ముడు—" అని తరతరాల వారు ఆశీర్వదిస్తారు.

### పెంపకము

రావిచెట్టును అతి సులభంగా పెంచవచ్చును. విత్తనాలు నాటిగాని, కొమ్మల ముక్కలు నాటిగాని రావిని పెంచవచ్చును. పక్షులు తమ రెట్టలద్వారా అక్కడక్కడా పడవేసిన విత్తనాలద్వారా రావి తనంతటతానే మొలుస్తుంటుంది. పెద్ద పెద్ద కొమ్మలు నాటితే రావి, త్వరగా పెరిగి పెద్దదవుతుంది. రావిచెట్టును ఇళ్ళదగ్గరగా పెంచరాదు. పెంచితే దాని వేళ్లు ఇళ్ళగోడలక్రిందికి వచ్చి, వాటి పునాదులనే కదలించి వేస్తాయి. భూగర్భజలమట్టం బాగా పైకి వున్న కొన్ని బొంబాయివీధుల వంటి చోట్ల రావిని నాటితే, దానివేళ్లు లోతుగా చొచ్చుకునిపోక పైపైనే అల్లుకుంటాయి. ఈ కారణంగా వర్షాకాలంలో ఏ మాత్రం గాలివీచినా ఆ చెట్టు కూలిపోతుంది.

దిగువహిమాలయాల సానువులలో పంజాబునుండి తూర్పుకూ, బెంగాలులో ఒరిస్సాలో, సర్కారు జిల్లాలలో, మధ్య భారతదేశంలోగల అడవులలో రావి స్వతస్సిద్ధంగా వ్యాపించివుంది. మనదేశంలో అనేక ప్రాంతాలలో రావిని నాటి, స్వేచ్ఛగా పెరగనిస్తారు. బొంబాయి, మరియు ఇతర నగరాలలో కొన్ని అందమైన రావిచెట్లున్నాయి. నగరాలలోని పాత భవనాల గోడలమీద ఉధృతంగా పెరుగుతున్న రావిమొక్కల నెన్నింటినో చూడవచ్చును.

## 18. బురోని

*FICUS PUMILA* Linn

*Family :* Moraceae

ఇంగ్లీషు పేరు : **IVY-LIKE FIG**

మనం ఇంతకుముందే 'ఫైకస్ బెంగాలెన్సిస్' (మర్రి) 'ఫైకస్ రెలిజియోసా' (రావి)లను గురించి తెలుసుకున్నాము; ఈ అత్తి (మేడిక) జాతి చెట్లలో అతి ఆకర్షణీయమైనదైన 'ఫైకస్ ప్యుమిలా' (బురోని) గురించి ఇపుడు తెలుసు కుందాము. బురోని మనదేశమంతటా కనపడుతుంది. బురోని చెట్టుగా కాక అల్లుకు పోయే పొదవలె పెరుగుతుంది. ఇది గోడలమీదకు ఎక్కబాకి గోడ గోడంతా ఆకులతో ఆకుపచ్చగా వుండేటట్లు చేస్తుంది. ఈ విషయంలోను, ఇంకా ఇతర అంశాలలోను దీనికీ, యూరోపియను లేక కాశ్మీరు 'ఐవీ'కీ ఎన్నో పోలిక లున్నాయి. అయితే బురోని నిజంగా అత్తిజాతికి చెందిన మొక్కేకాని మరొకటి కాదు. దీని పెద్ద పెద్ద సంయుక్త ఫలాలను చూచి దీనిని ఇట్టే పోల్చుకోవచ్చును.

అయితే బురోని పొదమీద పెరిగే ఈ ఫలాలనుచూచి అవి దీనివేనని మీరు తెలుసుకోకుండా పోయే ప్రమాదమూ ఉంది. బొంబాయిలో ఈ పొరబాటు జరగడం నాకు తెలుసు. అక్కడ బురోని మేడల మూడవఅంతస్తుదాక ప్రాకుతుంది; నన్నోసారి కొందరు మిత్రులు అడిగారు. "మా ఇంటిగోడలమీద పాకుతున్న 'ఐవీ' మొక్కలమీద ఎవరో పెద్ద పెద్ద అత్తికాయలను తగిలించారు. ఆశ్చర్యంగా లేదూ?" కాని నిజానికి ఆశ్చర్యం ఏమీలేదు. ఆ 'అత్తికాయ'ల నెవరూ 'తగిలించ' లేదు; అవి ఆ మొక్కను కాచినవే. ఆ మొక్క ఇంకేదో కాదు: బురోనియే!

బురోని జపాన్, చైనాలకు చెందింది. భారతదేశంలోని సమతల ప్రదేశాలలో దీనిని గోడలమీదకు, ఇళ్లమీదకు ప్రాకిస్తారు. సతతహరితమైన ఈ మొక్క ఒకసారి వేళ్లూని నెలకొన్నదంటే ఎక్కువశ్రద్ధ అవసరం లేకుండానే పెరగగలదు. ఉత్తరంవైపునుండే చల్లని గోడలమీద బురోని బాగా పెరుగుతుంది.

## వర్ణన

బురోని బహువార్షికమైనది; ప్రాకుడుపొద. దీని కాండపు కణుపులవద్ద చిన్నఆకులు గల కొమ్మలవద్ద వేళ్లు వస్తాయి. ఈ మొక్కకు రెండురకాల ఆకులుంటాయి. గొడ్డు మోతులైన కొమ్మలమీది ఆకులు చిన్నవిగా 2·5 సెంటిమీటర్ల పొడవున, 1·2 సెంటి మీటర్ల వెడల్పున ఉంటాయి. గొడ్డుమోతులు కాని కొమ్మలమీది ఆకులు 6·8 సెంటి మీటర్ల పొడవున 3·4 సెంటిమీటర్ల వెడల్పున ఉంటాయి. కోడిగ్రుడ్డు ఆకారంలో వున్న ఈ ఆకుల తొడిమెలు లావుగా ఉంటాయి. ఈ ఆకుల అంచులు నున్నగాను, కొనలు వర్తులంగాను ఉంటాయి. ఈనెలు క్రిందివైపు లావుగా ఉంటాయి; పైవైపున బాగా కనుపిస్తుంటాయి. ఆకు ఇరుపైపులా నూగు ఉంటుంది. ఆకు తొడిమె మొదలువద్ద రెండు వృంతపృచ్ఛములుంటాయి. ఇవి ఆకులవలెనే, త్రుప్పు పట్టినట్లుగా, ఉంటాయి. పొడుగాటి ఆకులుగల కొమ్మలమీదనే పుష్పపీఠా లుంటాయి. ఇవి 'పియర్' (బేరి) పండ్ల ఆకారంలో 5 సెంటిమీటర్ల పొడవున 3 సెంటిమీటర్ల వెడల్పున ఉంటాయి; ఈ పీఠం కొన కోసివేసినట్లుగా ఉంది. సరిగ్గా కొనమధ్యకు గుబ్బవంటిదానిని కల్గివుంటుంది. ఈ పుష్పపీఠానికి ఆధారంగా రక్షకపత్రావళివంటి పెద్ద చేటికలు రెండుంటాయి. ఇవి మొదట ఆకుపచ్చగాను తర్వాత ధూమ్రవర్ణంలోను వుంటాయి. ఈ పుష్పపీఠంలోపల అసంఖ్యాకములైన మగపువ్వులు, ఆడపువ్వులు ఉంటాయి. మగపువ్వులు పీఠంయొక్క కొనదగ్గర ఉంటాయి. ఆడపువ్వులు మిగతా పీఠాన్నంతా ఆక్రమించుకుని ఉంటాయి. మగ పువ్వుల తొడిమెలు పొడుగ్గా ఉంటాయి. మగపువ్వులో 2-3 రంగులేని ఆకర్షక పత్రాలూ, 2 పుప్పొడితిత్తులూ ఉంటాయి. గొడ్డుమోతులయిన దీని ఆడపువ్వు లలో 4-5 రంగులేని ఆకర్షకపత్రాలూ, ఆ ప్రక్కగా ఒక కీలాగ్రమూ ఉంటాయి. బురోని మొక్కయొక్క ఆడపువ్వులన్నీ గొడ్డుమోతులే.

## పెంపకము

బురోని అతిత్వరగా పెరిగి, కొన్ని సంవత్సరాల వ్యవధిలో ఎంతపెద్ద భవనా న్నయినాసరే తన ఆకులతో కప్పివేస్తుంది. దీని అంట్లనుగాని, ముక్కలనుగాని కుండీలలో పాతి, నీడలో ఉంచి పీక్లుపోయాలి. కాయలు కాచే కొమ్మలను కత్తి

రించి వేయాలి. లేకపోతే అవి గోదలకు అంటిపెట్టుకోక, తమ బరువువల
వికారంగా వ్రేలాడుతూ, చివరకు ఇతర కొమ్మలనుకూడా పెకలించవచ్చును.

బురోనియొక్క రెండురకాల ఆకులవలన దీనిని పోల్చుకోవడంలో కొంత ఇబ్బంది కలుగవచ్చును. చిన్న ఆకులూ, పెద్దఆకులూకూడా ఒకే మొక్కలో ఉంటాయి. చిన్నాకుల భాగాలు గొడ్డుమోతులు, పెద్దాకులవి ఫలవంతమైనవి. ఈ రెండూ కూడా ఒకే మొక్కలో భాగములే అని గుర్తుంచుకోవాలి.

## 19. గారుగ

*GARUGA PINNATA* Roxb

*Family :* Burseraceae

ఇంగ్లీషుపేరు : **GARUGA**

గారుగ నే గార్గు అనీ, గరుగుడు, కలుగుడు, అనీ అంటారు. 'గారుగ' అన్నది తెలుగుపేరు; ఇది ఇంగ్లీషులో యథాతథంగా ఉంచబడింది. 'పిన్నాటా' అంటే "ఈకలను పోలినది" అని భావము. గారుగయొక్క భిన్నపత్రాలు ఈకలనుపోలి ఉంటాయి. ఈ పత్రాలమధ్య ప్రధానవృంతమూ దాని కిటూ అటూ ఉపదళాలూ ఉంటాయి. భారతదేశపు ద్వీపకల్ప భాగమంతటా ఆకులురాల్చే చెట్లున్న అడవులలో గారుగ పెరుగుతుంటుంది. గారుగ అధికంగామాత్రం కనపడదు. ఇది సముద్రమట్టంనుండి 1000 మీటర్ల ఎత్తువాక పెరుగుతుంది. అప్పుడప్పుడూ దీనిని వీధులప్రక్కనకూడా నాటడం కద్దు.

### వర్ణన

గారుగ అందమైనచెట్టు; 10 మీటర్ల ఎత్తువరకు పెరుగుతుంది. అడవులలో ఇంకా ఎత్తుకు పెరుగుతుంది. ఆకులు 15-40 సెంటిమీటర్ల పొడవున వుంటాయి;




పటము 14. గాపుగ

చలికాలంలో ఆకులు ఎర్రబారి రాలిపోతాయి. దీనిది భిన్నపత్రం. ఈ భిన్నపత్రంలో ఆకు జతలుకాని అంతకన్న ఎక్కువ జతలుకాని ఉపదళాలూ, ప్రధాన వృంతాగ్రాన ఒక ఉపదళమూ ఉంటాయి. ఈ ఉపదళంయొక్క కుడి, ఎడమ భాగాలు సమానంగా ఉండవు. లేత దశలో ఆకుపచ్చగా ఉంటుంది. తర్వాత పురుగులదాడి కారణంగా ఎర్రగా మారుతుంది; ఎర్రటి బొబ్బలు ఏర్పడుతాయి. వేసవికాల ఆరంభంలో, చెట్టుమీద ఆకులు లేకుండా ఉన్నప్పుడు, దీని రెమ్మల చివర పసుపు పచ్చటిపూలు పూస్తాయి. దీనికాయ గుండ్రంగా, 15-20 మిల్లీమీటర్ల వెడల్పున ఉంటుంది. ఇది మొదట ఆకుపచ్చగానుండి తర్వాత పసుపు (లేక నల్ల) బారుతుంది.

### ఉపయోగములు

గారుగపండ్లకు ఆమ్లగుణం అధికంగా ఉంటుంది. దీనిని పండుగా తింటారు; లేక ఊరవేస్తారు. ఇది కొద్దిపాటి ఓషధీగుణంగల పండు. గారుగ బెరడూ, దీని ఎర్రటి ఆకులూ, అట్టి ఆకులమీద ఎర్రటి బొడిపెలూ చర్మ సంస్కారంలో ఉపయోగపడతాయి. దీని కర్రకు పురుగులు పడతాయి. ఈ కర్రను వంటచెఱకుగా వాడుతారు.

## 20. నగరికేసరి

*GLIRICIDIA SEPIUM* Walp

***Family :*** Papilionaceae

*ఇంగ్లీషు పేర్లు*: **GLIRICIDIA; MOTHER OF COCOA; MADURA SHADE TREE; NICARAGUAN SHADE TREE**

నగరికేసరిని మనదేశంలోకి ఇటీవల ప్రవేశపెట్టారు. మధ్య అమెరికాలోని గ్వాటిమాలా, దక్షిణ అమెరికా ఉత్తరభాగాలూ నగరికేసరి జన్మస్థలాలు. ఈశతా

ప్రారంభంలో దీనిని వెస్టిండీస్‌నుండి తెచ్చి సింహళంలోకి ప్రవేశపెట్టారు. 1915 నాటికి సింహళంనుండి బొంబాయికి కొన్ని నగరికేసరి మొక్కలు వచ్చాయి.

## పేర్లు

దీనిని బొంబాయిలో 'విదేశీ శిరీషము' అని పిలుస్తుంటారు. దీని జన్మస్థలంలో దీనిపేరు ''మేటా-రటోన్''. ఈ స్పానిష్ అమెరికన్ పేరుకు ''ఎలుకలను చంపునది'' అని తాత్పర్యం. ఈ భావం ఆధారంగానే దీనియొక్క "గ్లిరిసీడియా'' అన్న ఇంగ్లీషుపేరు వచ్చింది. దక్షిణ, మధ్య అమెరికాలలో నగరికేసరి బెరడును పొడిగాచేసి ఆ పొడిని బియ్యంతోగాని మొక్కజొన్న విత్తులతోగాని కలిపి ఎరగా పెట్టి ఎలుకలను చంపుతారు. అయితే బొంబాయిలో దీనిని పెంచడానికి వేరే కారణం ఉంది; ఇది అతిత్వరగా పెరిగి అందమైన పూవులను తొడుగుతుంది.

## వర్ణన

మెత్తటి చెక్కగల నగరికేసరి ఏటా ఆకులు రాలుస్తుంది; కోస్తాప్రాంతంలో నయితే దీని ఆకులు చలికాలంలో రాలుతాయి. ఈ మధ్యమ పరిమాణపుచెట్టు, అన్ని పరిస్థితులూ అనుకూలిస్తే 20 మీటర్ల ఎత్తువాక పెరుగుతుంది. కొన్నేళ్లనుండీ నేను బొంబాయిలోని కొన్ని నగరికేసరిచెట్లను చూస్తున్నాను. పదేళ్లకాలంలో అవి 18 మీటర్ల ఎత్తుకు పెరిగాయి. దీనిది భిన్నపత్రము. ఈ భిన్నపత్రంలో 7-8 జతల ఉపదళాలుంటాయి; చివర ఒకేదళం ఉంటుంది. ఉపదళం కోడిగ్రుడ్డు ఆకారంలో, చివర మొనదేలి ఉంటుంది. లేత దశలో దీనిమీద కొద్దిగా నూగుంటుంది. కాని తర్వాత ఉండదు. దీని అడుగువైపున ఈనెలుంటాయి. జనవరినుండీ, అనగా ఆకులన్నీ రాలినతర్వాత పువ్వులు పూస్తాయి. పువ్వులు లేత గులాబీ రంగులో, లేదా ధూమ్రవర్ణంలో, లేదా తెలుపుకలిసిన లేత గులాబీరంగుతో ఉంటాయి. ఇన్ని రంగుల పువ్వులూ ఒకేచెట్టుమీద ఉండవచ్చును. బోసిగా ఉన్న ఆ కొమ్మలన్నిటినీ ఈ రంగురంగులపువ్వులు కప్పివేస్తాయి. గిన్నె ఆకారంలో ఉండే దీని రక్షకపత్రావళి 6 మిల్లీమీటర్లకన్న తక్కువ పరిమాణంలో ఉంటుంది. ఈ రక్షకపత్రావళి అంచు ఇంచుమించుగా నున్నగా ఉంటుంది. బటాణీజాతిపువ్వుల

లక్షణాలన్నీ నగరికేసరి పువ్వులో కానవస్తాయి. దీని ఆకర్షకపత్రాలు 20 మిల్లి మీటర్ల పొడవున ఉంటాయి; పతాకదళంమాత్రం వెనక్కువంగి, రెండుగా చీలి ఉంటుంది. దీని కాయలో రెండు అర లుంటాయి. కాని బొంబాయిలో ఈ కాయలు ఎక్కువగా కనపడవు. నగరికేసరి పువ్వుల అందాన్ని ఫిబ్రవరి ఏప్రిలు నెలలమధ్య చూడాలి; అయితే పువ్వులు 'మే' నెలదాకా ఉంటాయి.

## ఉపయోగములు

అమెరికాలో దీని బెరడును ఎలుకలను చంపడానికి ఎరగా వాడుతారని తెలుసుకున్నాము. మనదేశంలో వీధులప్రక్కల నీడ నిమిత్తంగాని, అరటితోటలవంటి వాటిచుట్టూ గాలివేగాన్ని అడ్డడానికిగాని నగరికేసరిని పెంచుతారు. దీని ఆకులు శ్రేష్ఠమైన పచ్చియాకు ఎరువునిస్తాయి.

## పెంపకము

నగరికేసరిని విత్తనాలద్వారాగాని, శాఖా ప్రవర్ధనంద్వారాగాని సులభంగాపెంచవచ్చును. విత్తనాలయినా, కొమ్మ (లేదా కాండపు) ముక్కలయినా వర్షాకాల ఆరంభంలో నాటాలి. ఈ ముక్కలను 2-3 మీటర్ల ఎడముంచిగాని ఇంకా దగ్గరగాగాని నాటితే మొక్కలు అడ్డంగా గాక నిటువుగా పెరుగుతాయి. ఒక్కసారి నాటాక దీనికి ఎక్కువశ్రద్ధ అక్కరలేదు. దీని కొమ్మలను జాగ్రత్తగా కత్తిరిస్తుంటే ఈ చెట్టు ఆకారం చాలా సంవత్సరాలపాటు బాగుంటుంది; లేకపోతే మెత్తటి చెక్కగల దీని కొమ్మలు పువ్వుల, ఆకుల బరువుకి విరిగిపోవచ్చును. తగిన శ్రద్ధవహిస్తే వీధుల ప్రక్కలగాని, తోటల అంచులలోగాని ఈ చెట్టు కనుల పండుగగా పెరుగుతుంది. ఒక్క శిలామయమయిన నేలలోతప్ప ఇంకెట్టి నేలలో నయినా నగరికేసరి పెరగగలదు. వేల అంత మంచిది కానప్పుడు. కొమ్మల మొక్కలు నాటడానికి ఒక ఘనపుమీటరు గొయ్యిని త్రవ్వి సారవంతమైనమట్టితో గాని, ఎరువుతోగాని నింపాలి. మొక్క వేళ్లూనిన తర్వాత దానికి ఎక్కువ ఆలన పాలన అక్కర్లేదు. ఈ మొక్కలకు గనుక నీరుపోయడం అలవాటు చేస్తే, ఎండాకాలంలో దీనికి అతోధికంగా నీరు అవసరం అవుతుంది.

# 21. వరగోగు

*LAGERSTROEMIA SPECIOSA* Pers

*Family :* Lythraceae

ఇంగ్లీషు పేరు : **THE QUEEN'S FLOWER**

నేను భారతదేశంలోని అడవుల నెన్నింటినో చూశాను. కాని ఉత్తరకనరా దగ్గర జోగ్ జలపాత ప్రాంతంలో చూచిన ఒక అద్భుత దృశ్యాన్నిమాత్రం మరచి పోలేను. ఆ జలపాతానికి ఎగువగా ఒక పడవలో ఆ ప్రవాహాన్ని దాటుతుండగా అక్కడి దట్టమైన అడవిలో అక్కడక్కడా ముదురు ఎరుపురంగులో ఉండడం గమనించాను. ఆ తర్వాత, ఆ రంగు ఎక్కడిదా అని చూడగా 20 మీటర్ల ఎత్తు వరకు పెరిగిన పెద్ద పెద్ద చెట్లనిండా ఆ ముదురు ఎరుపురంగు పువ్వులే కను పించాయి. ఆ చెట్లచుట్టూ నేలమీదకూడా పువ్వులు ఎర్రటి తివాసీలను పరిచాయి అవి వరగోగు చెట్లు.

నగరాలలోనయితే వరగోగు 6 మీటర్ల ఎక్కువ ఎత్తువరకు పెరుగుతుంది. దీని పువ్వులు ధూమ్రవర్ణంలో ఉంటాయి. కాని ఉత్తరకనరా సమీపాన చెట్లు మరింత పెద్దగా పెరిగి, పువ్వులు లేతరంగులో కనుపించాయి.

## వర్ణన

తోటలలో, వీధులలో ఈచెట్టు 7-10 మీటర్ల ఎత్తున పెరుగుతుంది. దీనిమ్రాను విటారుగా పెరుగుతుంది; పాలిపోయినట్లుగా ఉంటుంది. దీనివి లఘుపత్రములు. ఇవి ఒక్కొక్కటి 16 సెంటిమీటర్ల పొడవున 6-8 సెంటిమీటర్ల వెడల్పున ఉంటాయి. వరగోగు ఆకు ఇంచుమించుగా మామిడాకువలె ఉంటుంది; అయితే ఇది కొంచెం వెడల్పుగా, బాగా కొనదేరి ఉంటుంది. దీని తొడిమె పొట్టిగా లావుగా ఉంటుంది. ఆకుమీద మధ్య ఈనె, 10-12 జతల పిల్లయీనెలు స్పష్టంగా




పటము 16. వరగోగు

కనపడుతుంటాయి. ఈ పిల్ల ఈనెలు ఆకు అంచున పైకి తిరిగి ఒకదానితో నొకటి కలిసి వంకరటింకర గీతలా ఏర్పడుతాయి.

దీని ఆకులు ఏడాదిలో ఒక్కసారి రాలిపోతాయి; అయితే ఆకులన్నీకూడా ఒక్కసారి రాలవు. ఫిబ్రవరి మార్చినెలలలో ఆకులు కొద్దిగా ఎర్రబడి (లేక పసుపుగా మారి) రాలుతాయి. మళ్లీ మేనెలలో పూతతోబాటు క్రొంజిగురాకులూ వస్తాయి.

పువ్వులు పొడుగాటి రెమ్మగుత్తులలో పూస్తాయి. ఈ గుత్తుల పొడవు 30 సెంటిమీటర్లుంటుంది. ఈ గుత్తి మొదట్లో ఉన్న పువ్వులు మొదట, కొసనఉన్న పువ్వులు ఆఖరున వికసిస్తాయి. పువ్వులు ధూమ్రవర్ణంలో ఉంటాయి. ఈ గణానికి చెందినదే చిన్నగోరింట (Lagerstroemia indica) అన్న చెట్టు ఉంది. అది వరగోగుకన్నా చిన్నచెట్టు. నగర వీధులలో పెంచడానికి సామాన్యంగా చిన్న గోరింట నెన్నుకుంటారు. చిన్నగోరింట పువ్వులు ఎర్రగా ఉంటాయి.

వరగోగు పువ్వుయొక్క రక్షకపత్రావళి ఆకుపచ్చగా, మెత్తటి తెల్లటినూగుతో ఉంటాయి. రక్షకపత్రాలన్నీ కలిసి గిన్నెవలె ఉంటాయి. ఈ గిన్నెమీద గీత లుంటాయి. ఆకర్షకపత్రాలు ధూమ్రవర్ణంలో, స్పష్టమైన ఈనెలతో ఉంటాయి. ఈ ఆకర్షకపత్రాల మొదలు సన్నగాఉండి, మిగతాభాగం వెడల్పుగా ఉంటుంది. వీటి అంచులు వర్తులంగానో, కొద్దిగా మెలికలు తిరిగో ఉంటాయి. పువ్వు మధ్య చాల కేసరాలు ఉంటాయి. ఇవి ఎర్రగానో లేక పసుపుగానో ఉంటాయి. ఇవి ఆకర్షక పత్రాలకన్న పొట్టిగా ఉంటాయి. పోగుల చివర పుప్పొడితిత్తులు ఎర్రగా (లేక ధూమ్రవర్ణంలో) ఉంటాయి. దీని పండ్లు చిన్నవి; 2-3 సెంటిమీటర్ల పొడ వున ఉంటాయి. ఈ గుండ్రటి పండుచివర, పువ్వులోని కీలభాగమే, సన్నటితోక వలె రూపొంది ఉంటుంది. వర్షర్తుప్రారంభంలో ఏర్పడిన ఈపండ్లు మరు సంవ త్సరం పువ్వులు పూచేదాక చెట్టుమీదే ఉంటాయి.

## పూత

వర్షాకాలానికి ముందుగా, వేసవిలో వరగోగు పూస్తుంది. అప్పుడప్పుడు నగర వీధులలో ఈ చెట్టు వానాకాలంలోకూడా, సెప్టెంబరుదాక కూడా పువ్వులతో కను

పిస్తుంటుంది. దట్టంగా పువ్వులు పూయకమేకాక, ఆ పువ్వులు చాలాకాలం ఉండడం కారణంగా వరగోగు వీధులవెంబడి పెంచడానికి అనువైనది. బొంబాయి నుండి దక్షిణాన కన్యాకుమారి వరకు ద్వీపకల్ప భారతదేశంలో వరగోగుని పెంచుతున్నారు.

## వ్యాప్తి

పడమటి కనుమలలో బెళగాం నుండి మలబారు, తిరువాన్కూరులవాక, ఉత్తర దక్షిణ కనరాలలోగల వతతహరితమైన అడవులలో వరగోగు స్వతస్సిద్ధంగా పెరుగుతుంది. వరగోగు ఎక్కువగా నదుల, వాగుల ఒడ్డున పెరుగుతుంది. సింహళం, బర్మా, మలేసియా, ఆస్ట్రేలియా, చైనాలలో కూడా వరగోగు కాన వస్తుంది.

## ఉపయోగములు

వరగోగు ఎన్నోవిధాల ఉపయోగపడుతుంది. మనోహరమైన దీని పువ్వుల కారణంగా ఇది వీధులలో చెట్లలో పెంచడానికి చాల యోగ్యమైనది. నీటిలో తడిసినా, నానినా చెడిపోని దీని చెక్కతో పడవలను తెప్పలను తయారుచేస్తారు. ఈ చెక్కను రేవులలో వాసాలుగా, స్తంభాలుగా వాడుతారు. బర్మాలో నయితే టేకు తర్వాత దీని చెక్కను అత్యుత్తమమైన కలపగా వాడుతారు. వరగోగు వైద్యంలో కూడా పనికివస్తుంది. వరగోగు విత్తనాలు మత్తు కలిగిస్తాయి. దీని బెరడు విరేచనకారి. దీని వేరుని జ్వరాలకు, విరేచనాలకు మందుగా వాడుతారు. ఇటీవలే, వరగోగుచెట్టుయొక్క అన్నిభాగాలూకూడా మధుమేహానికి మంచివని కనుగొన్నారు.

## 22. పెద్ద ఇప్ప

### *MADHUCA INDICA* Gmel

*Family :* Sapotaceae

ఆంగ్లము పేరు : **THE MAHWA TREE**

పెద్ద ఇప్పకే ఇప్ప, అడవి ఇప్ప, మధూకము అన్న నామాంతరాలున్నాయి.

పెద్ద ఇప్పంత రాజసమైన, ఉపయోగకరమైన చెట్లు మనదేశంలో ఎక్కువ లేవు. దీనిలోని ప్రతిభాగమూ ఉపయోగపడుతుంది.

కొన్ని పాత వృక్షశాస్త్ర పుస్తకాలలో పెద్దయిప్పను[1] Bassia Latifolia Roxb, అని పేర్కొంటారు. కాని నవీన గ్రంథాలలో ఇది Madhuca Indica Gmel గా మార్చబడింది. ఎందుకంటే Chenopodiaceae కుటుంబానికి చెందిన ఒక చిన్నమొక్కను ఆలియోని (1766) Bassia అని వర్ణించాడు. కనుక ఆ పేరును ఇప్పకు వాడడం సరికాదు. "ఒక్కొక్క మొక్కకూ ఒక్కొక్క పేరుండాలి; ఒక్కొక్క పేరుతో ఒకటే మొక్క ఉండాలి" అన్న సూత్రాన్ని ఎప్పుడూ మరవ రాదు.

### వ్యాప్తి

పెద్దఇప్ప మధ్య భారతదేశానికి చెందినది. గుజరాత్, పడమటికనుమలు, తూర్పున ఛోటానాగపూరు ప్రాంతాలలోనూ ఇది స్వతస్సిద్ధంగా పెరుగుతుంది. ద్వీపకల్ప భారతదేశమంతటా పెద్దఇప్పను పెంచుతారు. కాని మద్రాసులోనూ, బెంగాలులోనూ ఇది కనపడదు.

[1] పెద్దఇప్ప (Bassia Latifolia Roxb) మధ్యభారతదేశంలోనూ, చిన్నఇప్ప (Bassia Longifolia Linn) దక్షిణభారతదేశంలోనూ పెరుగుతాయనీ, మొదటిదాని ఆకులు వెడల్పుగాను, రెండవదాని ఆకులు పొడవుగాను ఉంటాయని ఎ. డబ్లియూ. లషింగ్టన్ వర్ణించాడు. - అను॥




పటము 17, పెద్ద ఇప్ప

## వర్ణన

ఆకులురాల్చే ఈ చెట్టు 20 మీటర్ల ఎత్తుదాక పెద్ద కుంభంతో పెరుగుతుంది. ఆకులు కొమ్మల చివర గుత్తులు గుత్తులుగా ఉంటాయి. ఒక్కో ఆకూ 7-20 సెంటిమీటర్ల పొడవున 3-7 సెంటిమీటర్ల వెడల్పున ఉంటుంది. ఆకు కోడిగ్రుడ్డు ఆకారంలో ఉంటుంది. లేతాకుమీద నూగుంటుంది; ముదురాకుమీద బొత్తిగానూగు ఉండదు. చెట్టు ఆకులన్నీ రాలిపోయాక పువ్వులు దట్టమైన గుత్తులుగా పూస్తాయి. పొడుగాటి తొడిమెగల పెద్ద ఇప్పపువ్వు వాలి ఉంటుంది. ఇది త్రుప్పుపట్టినట్లున్న మృదువైన నూగుతో ఉంటుంది. రక్షకపత్రావళి 1·5 సెంటిమీటర్ల పొడవున. క్రిందిదాక చీలి, నాలుగు భాగాలుగా ఉంటుంది. దీని పువ్వు పాలమీగడరంగులో ఉంటుంది. ఈ పువ్వు 2·5 - 3 సెంటిమీటర్ల వెడల్పున 8-10 తమ్మెలతో ఉంటుంది. కేసరాలు 25 దాక ఉంటాయి. రోమయుతమైన దీని అండాశయం మీద 2·5 సెంటిమీటర్లు (లేక అంతకన్న ఎక్కువ) పొడవుగల కీలముంటుంది. పండు 3-5 సెంటిమీటర్ల పొడవుగల్గి దీర్ఘగోళాకారంలో ఉంటుంది. పండుమీద నూగు ఉంటుంది. గుజ్జు గల్గిన ఈ పండు మొదట ఆకుపచ్చగా, తర్వాత ఎరుపు నారింజరంగులో ఉంటుంది. దీనిలో 1-4 గింజలుంటాయి.

## ఉపయోగములు

పెద్దఇప్ప చెక్క గట్టిగా ఉంటుంది. కాని ఈ చెట్టుయొక్క ఇతర ఉపయోగాలతో పోలిస్తే దీని కలపను వాడుకోవడం ఈ దేశంలో తక్కువే. ఇప్పపువ్వులను పచ్చిగాగాని వండిగాని తింటారు. ఎండుపువ్వులను నీళ్లలో తడిపి పులియబెట్టి, బట్టీపట్టి కల్లు తయారుచేస్తారు. ఈ కల్లును ఎన్నోవిధాల ఉపయోగిస్తారు. పెద్ద ఇప్పపువ్వులు అదో వాసనతో వెగటు కల్గించేటట్లుంటాయి. బట్టీ పట్టాక దీని కల్లులోకూడా ఈ వెగటువాసన ఉంటుంది. గుంటనక్కలు, జింకలు, పందులు దీని పూవుల నిష్టంగా తింటాయి. ఎలుగుబంటుల కయితే ఇప్పపువ్వులమీద ప్రీతిమెండు. ఎలుగుబంట్లు కడుపునిండా ఈ పువ్వులను తిన్నతర్వాత, ఈ పువ్వులు వాటి కడుపుల్లోపల పులుస్తాయి; అప్పుడిహ ఆ జంతువులు మత్తుగా, త్రాగినవారిపలె పడివుంటాయట. అట్టి మత్తులోఉన్న జంతువులు తప్ప త్రాగిన

మనుష్యులవలెనే ప్రవర్తిస్తాయని చూచినవారు చెబుతారు. కొండ తెగలవారు, ముఖ్యంగా పశ్చిమభారతదేశంలోనివారు, ఈ పండుగుజ్జును తింటారు. దీని గింజలనుండి తీసిన చమురును ప్రమిదలలోకి వాడుతారు. ఈ నూనెనే మధ్య భారతదేశంలోని కొన్ని తెగలవారు వంట కుపయోగిస్తారు. మంచి నేతిలో కలిపి కల్తీ చేయడానికి ఈ నూనెను వాడుతుంటారు. ఇప్పనూనెను సబ్బుతయారీలో వాడుతారు. ఇటీవల సబ్బుతయారుచేసే పెద్ద పెద్ద కంపెనీలుకూడా ఇప్పనూనెను వాడుతున్నాయి.

దక్షిణ, మధ్యభారతదేశాలలోని గోండ్ తెగలవారికి ఇప్పచెట్టు ఆహారాన్నిస్తుంది. దియ్యవు విల్వలు తక్కువగా ఉండగల వేసవికాలంలో ఇప్ప పువ్వులు పూస్తుంది: కాయలు కాస్తుంది. మరాఠా రాజులకాలంలో పర్వతప్రాంతాలలోని పెద్దఇప్పచెట్ల అన్నిటినీ కొట్టి పారవేసేవారట. ఇట్లాచేస్తే చట్టవిరోధులైన కొండతెగలవారు సరిగా తిండి దొరకక నశించిపోతారని ఆ చెట్లను నరికివేసేవారు. దొంగతనపు సారా కాపును అరికట్టే నిమిత్తం ప్రభుత్వంవారు పశ్చిమప్రాంతాలలోని పెద్ద ఇప్పచెట్లను నరికిస్తున్నారు. కాని ఇదేమంత మంచిపనికాదు. ఏ మాత్రపు శ్రద్ధకూడా లేకుండా, ఎటువంటి నేలలోనయినా పెరిగే ఇప్ప ఆహారాన్ని కలపను ఇస్తుంది. దానిని పడగొట్టినంతమాత్రాన మద్యపానం తగ్గిందా అంటే అదీ లేదు।

## 23. మామిడి

*MANGIFERA INDICA* Linn

*Family*: Anacardiaceae

*ఇంగ్లీషు పేరు*: **THE MANGO TREE**

చెట్లను గురించిన ఏ పుస్తకమయినా మామిడిచెట్టును గురించి చెప్పనిదే సమగ్రం కానేరదు. మన నగరాలలో సాధారణంగా మామిడిచెట్లను వీధులప్రక్కల పెంచక

కోవడం నిజమే కాని అక్కడక్కడా ఇది వీధులలో కనుపిస్తుంటుంది. కనుకనే దీని ఈ పుస్తకంలోకి చేర్చడమయినది. ఎన్నో గ్రామాలలో మట్టికి బదులుగా మామిడి ఊరి రచ్చబండగా చలామణి అవుతూంటుంది.

స్వతస్సిద్ధంగా నయితేనేమి, పెంచడం కారణంగా నయితేనేమి, మామిడి ఆసేతుహిమాచలమూ కనబడుతుంటుంది. పురాతనమైన సాహిత్యంలోనూ, శిల్పాలలోనూ ఉన్న ప్రసక్తిని బట్టిచూస్తే మామిడి కొన్నివేల ఏండ్లనుండీ ఈదేశంలో ఉంటుందని తెలుస్తూంది. దీని ఆదిమ నివాసస్థలం ఏది అన్నదానిమీద తర్జన భర్జనలు సాగుతున్నా, ఇది ఆగ్నేయాసియా, మలేసియా ప్రాంతంనుండి వ్యాపించిందని అంటారు. ఇప్పటి అస్సాము - బర్మాప్రాంతం ఒకప్పటి మామిడి జన్మస్థలం అయివుండవచ్చును.

## పేర్లు

లిన్నే దీనికి ''మేంగిఫెరా ఇండికా'' అన్న పేరు పెట్టాడు; అనగా 'మామిడి పండ్లనిచ్చే భారతదేశపు చెట్టు' అని అర్థం. ఇంగ్లీషులోనూ, యూరపియను భాషలలోనూ దీని పేరయిన "మేంగో" అన్నపదం మలయన్ పేరయిన ''మంగ్గా'', తమిళపు పేరయిన "మాంగా''ల నుండి వచ్చివుంటుంది. సంస్కృతంలో మామిడికి ఆమ్ర, చూత, రసాలాది నామము లెన్నో ఉన్నాయి.

## ఉపయోగములు

భారతీయసాహిత్యంలో మామిడివలె స్తుతించబడినచెట్టు మరొక్కటి లేదు. దీనిని కల్పవృక్షంగా వర్ణించారు. ప్రేమకూ భక్తికీ సంకేతంగా దీని పేరును సూచించారు. మామిడిపువ్వును మన్మథుని బాణాలలో ఒకటిగా కాళిదాసాది కవులు వర్ణించారు. క్రీ. పూ. 150 నాటిదయిన సాంచీ స్తూపంమీద మామిడిచెట్టూ మామిడిపండ్లూకూడా అద్భుతంగా చెక్కబడినాయి. భారతీయ శిల్పాది కళలు మామిడిని ప్రస్తుతించడానికి సాంచిస్తూపాన్నొక తార్కాణంగా తీసుకొనవచ్చును.

మామిడిపండును 'పండ్లల్లో రాజు'—అన్నారు. ఆ బిరుదు ఎంతయినా సమంజసమే. ఇపుడు భారతదేశంలో ఎన్నో మామిడిరకాలను పెంచుతున్నారు. కంద




పటము 18. మామిడి

గల రకాలను తినడానికి, పీచుగలవాటిని రసం జుర్రడానికీ వాడుతారు. మామిడి కాయలను తరిగి ఊరగాయ వేస్తారు. మామిడికాయలతో అతిరుచికరమైన పచ్చళ్లను చేస్తారు. మామిడిపండ్ల ముక్కల నిటీవల డబ్బాలలో నిల్వచేయడం మొదలుపెట్టాక ఈ పండుని ఏడాది పొడవునా తినడానికి వీలవుతుంది. దోర మామిడిపండ్లు, పాలూ, పంచదారా కలిపి 'మేంగో ఫూల్' అన్న ఆహ్లాదకరమైన పానీయాన్ని చేస్తారు: ఈ పానీయాన్ని చల్లగా పుచ్చుకుంటే ఎండాకాలంలో ఎంతో బాగుంటుంది. మామిడి రసాన్ని ఇటీవల సీసాలలోనింపి సోడా, బత్తాయి రసం వలెనే అమ్ముతున్నారు. మామిడిపండును గురించి ఏమని చెప్పను? అది దేవతలకు తగినపండు-అంటే చాలునేమో। భారతదేశానికి వచ్చే విదేశీయులకు మామిడిపండ్ల రుచి నచ్చుతుంది కాని అది వారి చేతులనుండి జారి, ఎగిరిపో తుండడం, పాపం వారి కిబ్బందిగా ఉంటుంది. అందుకనే ఇటీవల ఒక విదేశీ రచయిత మామిడిపండు నారగించడానికి ఒక ఉపాయం చెప్పాడు. 'శుభ్రంగా బట్టలన్నీ విడిచేసి, స్నానపుతొట్టెలో కూర్చుని అప్పుడిహ తాపీగా ఈ పండు పని పట్టండి'-అని సలహా ఇచ్చాడతడు।

## మామిడిజాతులు: రకాలు

తినడానికి పనికివచ్చే మామిడిపండ్ల రకాలు, స్వతస్సిద్ధంగా పెరిగే చాల రకాలు 'మేంగిఫెరా ఇండికా' జాతికి చెందినవే. భారతదేశంలో 'మేంగిఫెరా ఇండికా లిన్' 'మేంగిఫెరా సిల్వాటికా రాక్స్బ్' అన్న రెండుజాతులున్నాయి. రెండవజాతి ఎక్కువగా ఈశాన్య భారతమందు కనిపిస్తుంది. దాని పండ్లు తిన డానికి పనికిరావు. పోతే ప్రపంచమంతటా ఎన్ని మామిడిజాతులున్నాయి అన్న దానిమీద వృక్షశాస్త్రజ్ఞులు వేర్వేరు అభిప్రాయాలను ప్రకటించి ఉన్నారు. కొందరు 32 అనీ కొందరు 41 అనీ కొందరు 65 అనీ అన్నారు. మామిడిరకాలయితే ప్రపంచం మొత్తంమీద ఎన్ని ఉన్నాయో లెక్కలేదు. మనదేశంలో మాత్రమే 500 రకాలున్నాయంటారు. అయితే రకానికీ రకానికీ మధ్యవున్న తేడా ఏమిటో తెలుసుకోవడం కష్టం. రచయితలూ, మామిడిని పెంచేవారుకూడా తమతమ చిత్తాను సారం పేర్లుపెట్టడంతో ఈ రకాలను పోల్చుకోవడం కష్టతరమవుతుంది.

బొంబాయికిచెందిన 'అల్ఫాన్సో' లేక 'అఫూజ్' దేశంలోని అత్యుత్తమ మామిడిపండ్ల రకాలలో ఒకటిగా పరిగణించబడుతుంది. సాధారణంగా డజను అల్ఫాన్సో పండ్లధర 16 రూపాయలుంటుంది; 1965 వేసవిలోనయితే ఇవి డజను 40 రూపాయలు పలికాయి. ఇహ-ఈ క్రిందివాటిని భారతదేశంలో అత్యుత్తమ రకాలుగా ఎన్నిక చేస్తారు. పశ్చిమాన 'అఫూజ్', 'పెయిరీ', దక్షిణాదిని 'నీలం', 'బనగానిపల్లి'; ఆంధ్రలో 'సువర్ణ రేకలు' 'మల్గోవా'; బీహారులో ఉత్తరప్రదేశ్‌లో 'చౌసా' 'దసేరి' 'లంగ్డా' బెంగాల్‌లో 'గులాబ్‌ఖాస్' 'బొంబై'. రుచిలో కాక పోయినా, పరిమాణంలో ఆంధ్రకు చెందిన 'తెన్నేరు'దే అగ్రతాంబూలం. ఈ రకం మామిడిపండు 23 సెంటిమీటర్ల పొడవున 1·6 కిలోల బరువుతో ఉంటుంది.

## వర్ణన

మామిడి పెద్దచెట్టు; 6- 15 మీటర్ల ఎత్తున పెరుగుతుంది.బాగా గుబురు చేస్తుంది. అడవులలోనయితే మామిడిచెట్టు 30 మీటర్ల ఎత్తుకు లేదా అంతకన్న ఎక్కువ ఎత్తుకు పెరుగుతుంది. ఆకులు మరచుట్టుప్రసారంలో ఉంటాయి కాని కొమ్మలచివర దట్టమైన గుత్తులలో ఉంటాయి. ఆకులు బిరుసుగా, తళతళలాడుతూ ఉంటాయి. ఆకులు 12-30 సెంటిమీటర్ల పొడవున, 3·9 సెంటిమీటర్ల వెడల్పున, బల్లెపు ఆకారంలో ఉంటాయి. ఆకు మొదట, చివరాకూడా కొనదేరి ఉంటుంది. ఆకుల అంచులు నొక్కులు నొక్కులుగా ఉంటాయి. ఆకు తొడిమె 1·5 సెంటిమీటర్ల పొడవుంటుంది. పువ్వులు విడివిడిగా నయితే చిన్నవిగా ఉంటాయి; కాని అవి పసుపు పచ్చటి, పెద్ద రెమ్మగుత్తులుగా కొమ్మల రెమ్మల చివర వ్రేలాడుతుంటాయి. రక్షకపత్రాలు చిన్నవి; పుటాకారంలో, పసుపు కలిపిన ఆకుపచ్చరంగులో, వెలుపల కొద్దిపాటి నూగుతో ఉంటాయి. ఆకర్షకపత్రాలు పొడవు కన్న ఎక్కువ వెడల్పు కలిగి, పసుపు కలిపిన ఆకుపచ్చరంగులో, మొదలునందు అంచులందు లేతగులాబీ (లేక ధూమ్ర) వర్ణంలో ఉంటాయి. ఉన్న 4-5 కేసరాలూ సమాన మైన ఎత్తులో ఉండవు. వాటిలో ఒకటి పెద్దదిగా ఉంటుంది; అదే సంపర్క యోగ్యమైనది. మిగతావన్నీ గొడ్డుమోతులయి, కేవలం కాడలవలె ఉంటాయి.

పెద్ద కేసరానికి పొడుగైన పోగూ, దాని చివర ధూమ్రవర్ణపు పుప్పొడితిత్తి ఉంటాయి. పూర్తిగా వికసించినప్పుడు ఈ పువ్వు వెడల్పు 6-8 మిల్లీమీటర్ల వెడల్పున ఉంటుంది; దీని వాసన బాగుండదు. మామిడిది టెంక గలిగిన పండు (డ్రూప్). మధ్యవున్న టెంకచుట్టూ కండవుంటుంది. ఈ కండయొక్క వాసనను బట్టి, దాని రుచినిబట్టి, కండలో పీచు లేకపోవడంబట్టి మామిడిపండు నాణ్యం నిర్ణయిస్తారు. ఆకారంలో మామిడిపండు హృదయాన్ని పోలి ఉంటుంది. అయితే వివిధరకాల ఆకారపరిమాణాలు వివిధములుగా ఉంటాయి. మామిడికాయలు ఘాటైన, టర్పెంటు వాసనతో ఉంటాయి; మేలిరకాలలో కాయపండాక ఈవాసన ఉండదు.

## పెంపకము

మామిడిని శాఖాప్రవర్ధనంద్వారా అనగా అంటుకట్టడం, అంటుత్రొక్కడం ద్వారా పెంచుతారు. ఎంత మేలిజాతిరకపు మామిడివిత్తనాన్నయినా నాటితే దాని నుండి పుట్టిన మొక్క దాని తల్లి మొక్కను పోలకుండా దాని పాత వన్యస్థితి లక్షణాలను కలిగివుంటుంది.

మనదేశంలో చాలచోట్ల మామిడిచెట్లను బదనిక (బద్దు) అన్న పరాన్నభుక్కు పీడిస్తుంది. దీని విత్తనాలను పక్షులు చెట్టునుండి చెట్టుకు చేరవేస్తాయి. జిల్లా మొత్తానికి ఇది ఒక్కటి ఉన్నా చాలు. త్వరలో జిల్లా అంతటా విస్తరిస్తుంది. ఈ పరాన్నభుక్కువలన చెట్టుమీద పెద్ద పెద్ద బొబ్బల వంటివి ఏర్పడుతాయి. ఈ జబ్బు ముదిరి చివరకు మామిడిచెట్టు కాపు ఆగిపోతుంది. దీని నరికట్టడానికి చెట్లను అప్పుడప్పుడూ, జాగ్రత్తగా కత్తిరిస్తుండాలి. ద్వీపకల్ప భారతదేశంలో 'వండా' 'అకాంపై' వంటి ఆర్కిడ్ మొక్కలు మామిడిచెట్లమీద పెరుగుతూంటాయి; ఇవి మామిడిచెట్లకు ఎట్టిహానీ కలిగించవు. పైపెచ్చు వేసవి కాలంలో ఈ చెట్లను తమ రంగురంగుల పూవులతో అలంకరిస్తాయి.

# 24. వెఱ్ఱివేప

*MELIA AZADERACH* Linn

*Family*: Meliaceae

ఇంగ్లీషు పేర్లు: **PERSIAN LILAC; BEAD - TREE; BASTARD CEDAR**

వెఱ్ఱివేపనే 'తురకవేప' అనికూడా అంటారు. వెఱ్ఱివేపను సంస్కృతంలో హిమద్రుమమనీ, అక్షద్రుమమనీ, మహానింబమనీ, పర్వతనింబమనీ అంటారు.

వెఱ్ఱివేపను, అసలు వేప (Azadirachta indica) ను ఒకదానినుండి ఇంకొక దానిని పోల్చుకోలేక పోతుంటారు అయితే ఈ రెండిటికీ తేడా లున్నాయి. వేపపువ్వులు తెల్లగా ఉంటాయి; వెఱ్ఱివేపపువ్వులు లేతగులాబీ రంగులో ఉంటాయి. ఈ రెంటి ఆకుల ఆకారం వేర్వేరుగా ఉంటుంది.

సతతహరితమైన వెఱ్ఱివేప సిగువ హిమాలయప్రాంతాలలో స్వతస్సిద్ధంగా పెరుగుతుంది. ఇది ప్రస్తుతం భారతదేశమంతటా మాత్రమేకాక ప్రపంచమందలి ఉష్ణ, అర్ధోష్ణ మండలాలలో చాలచోట్ల కనపడుతుంది. భారతదేశంలో ముస్లిములు ఈ చెట్టువ్యాప్తికి తోడ్పడ్డారని అంటారు. బొంబాయి వీధులలో, తోటలలో 12-15 మీటర్ల ఎత్తుకు ఎదుగుతుంది. దీని కొమ్మలు బాగా విస్తరించి మంచి నీడనిస్తాయి. చిన్నవయినా దీనిపువ్వులు, లేశమాత్రపు వాసనతో చూడ ముచ్చటగా ఉంటాయి.

## వర్ణన

దీనిఆకులు మరచుట్టు ప్రసారంలో ఉంటాయి. ఇవి ద్విభిన్నపక్షాకారంగాగాని త్రిభిన్నపక్షాకారంగాగాని ఉంటాయి. కాంతివంతమైన ఆకుపచ్చరంగులో ఉంటాయి. 18-35 సెంటిమీటర్ల పొడవున ఉండే ఈ ఆకులు ఉపదళాలుగా చీలి ఉంటాయి; ఈ ఉపదళాలు పిల్లదళాలుగా చీలి వుండవచ్చును. ఇవి రంపగరి అంచు

లతో కోడిగ్రుడ్డు ఆకారంలో ఉంటాయి. వీటి మొదలుదగ్గర కుడి ఎడమ భాగాలు సమానంగా ఉండవు. చివరకు కొనదేలి ఉంటాయి. ఈ భిన్నపత్రపు రెమ్మకు అటూ ఇటూ ఎదురెదురుగా ఉపదళాలు ఉంటాయి. నూగు బొత్తిగా లేని దీని ఆకు ఆకుపచ్చగా తళతళమంటూ ఉంటుంది. కించిత్ వాసన కల్గిన దీని పువ్వులు విడివియైన రెమ్మగుత్తులలో ఉంటాయి. ఈ గుత్తులు ఆకులంతగాని వాటి కన్న పొడవుగాగాని ఉంటాయి. పువ్వు తొడిమె సన్నగా 2·5 సెంటిమీటర్ల పొడవున ఉంటుంది. వికసించినపువ్వు 2 - 2·5 సెంటిమీటర్ల వెడల్పున ఉంటుంది. దీని ఆకర్షకపత్రాలు నాడా ఆకారంలో, లేతగులాబీ రంగులో ఉంటాయి. ఈఆకర్షక పత్రాల మొదలు లేతరంగులో, చివరలంచు కాస్త ముదురురంగులో ఉంటాయి. కేసరాలన్నీ కలిసి గొట్టాకారంలో, మధ్యభాగానికి దిగువగా కొద్దిగా ఉబ్బి ఉంటాయి. ఈ గొట్టపు అంచున 10 కేసరములు అమరివుంటాయి. దీనిపండులో గుజ్జూ, గుజ్జుమధ్య 4 గట్టి విత్తనాలూ ఉంటాయి.

## గుణగణాలు

పూతమీద లేకపోయినా వెర్రివేపచెట్టు నయనానందకరంగా ఉంటుంది. అందు కనే ఇది ఈ దేశంలోను ఇతరదేశాలలోనూ వీధులప్రక్కల పెంచబడుతూంది. పువ్వులతో ఉన్న వెర్రివేపచెట్టు మనోజ్ఞంగా ఉంటుంది. ఈ చెట్టు బెరడుకు గాట్లు పెడితే లభించే బంకను వేపబంకవలె వాడుతారు. దీని ఆకులపసరు రుచి బాగుండక పోయినా, కడుపులోని పురుగులను చంపడానికి మందుగా వాడుతారు. దీనిపండ్లు మనుష్యులకు విషప్రాయమైనవి. కాని వీటిని మేకలు, గొర్రెలు తిని తిరుగు తుంటాయి. వెర్రివేపకాయలతో మాలలు కడతారు. ఈ మాలలను మెడలో ధరిస్తే కొన్ని అంటువ్యాధులు రావని నమ్ముతారు. ఈ పండ్ల, ఆకుల కషాయము బట్టలు మొదలయినవాటికి పురుగులు పట్టకుండా కాపాడుతుంది.

మొదటగనుక కాస్త శ్రద్ధవహిస్తే వెర్రివేప ఎట్టినేలలలోనయినా, ఎట్టి వాతా వరణ పరిస్థితులలోనయినా (మరీ చల్లగా వుండే తప్ప) పెరుగుతుంది. బొంబాయి చుట్టుప్రక్కల, దక్కన్‌లోని బెట్టప్రాంతాలలో, దక్షిణభారతదేశంలోని చాలాచోట్ల వెర్రివేప బాగా పెరుగుతుంది.

పువ్వులు ఏప్రిల్‌లో వస్తాయి; రెండుమూడు నెలలదాకా ఉంటాయి. అయితే చిన్నవయిన పువ్వులకోసంగాక సతతహరితములయిన ఆకులకోసం వెర్రివేపను పెంచుతారు.

## 25. పెద్దల్లి

*MEMECYLON UMBELLATUM* Burm

*Family*: Melastomataceae

ఇంగ్లీషు పేరు : IRON - WOOD TREE

పెద్దల్లికి చాలా మారుపేర్లున్నాయి. అవి : అల్లి, మంచియల్లి, కిక్కల్లి, ఉద్దల్లి మిదల్లి, కొర్రేణ్వి. 'మెమెసిలాన్' గణపుజాతులు ఎన్నో బొంబాయిచుట్టూ ఉన్నాయి. వాటన్నిటినీ కూడా 'అంజాన్' అన్న ఒక్క పేరుతోనే పిలుస్తున్నారు; ఇంగ్లీషులో దీనిని "ఐరన్ వుడ్ ట్రీ" అంటారు. ఇదే ఇంగ్లీషుపేరు (Sider-oxylon లేక Xantolis (ఖిజ్జావేన) అన్న చెట్టుకూ ఉండడంవలన కొంత గందరగోళం ఏర్పడుతుంటుంది. ఈ పెద్దల్లి చెట్టునే కొన్ని పాతపుస్తకాలు Memecylon edula అని లేక Memecylon tinctorium అని వర్ణిస్తాయి.

పెద్దల్లి బొంబాయిలోని విక్టోరియాగార్డెన్స్ మొదలగు చోట్ల ఉంది కాని వీధులలో కనుపించదు. అయితే మహాబలేశ్వర్ పీఠభూమిమీద, పడమటి కనుమలలోని కొండప్రాంతాలలో అధికంగా కనబడే చిన్న చెట్లలో ఇది ఒకటి. మార్చి ఏప్రిలు నెలలలో నేను మహాబలేశ్వర్‌లో ఈ చెట్ల అందంచూచి ముగ్ధులమై అయ్యాము. ఈ పువ్వులు చిన్నవే అయినా, ఇవన్నీ కలిసి ఆ మైదానాలను రంగులమయం చేసివేశాయి.

## వర్ణన

మధ్య పరిమాణందాక పెరిగే ఈ చిన్నచెట్టు 6-12 మీటర్ల ఎత్తున ఉంటుంది. లేత కొమ్మలూ కాండాలూ గుండ్రంగా నున్నగా ఉంటాయి. ముదురువి పగుళ్లతో గరుకుగా ఉంటాయి. ముదురాకు పచ్చరంగులో ఉండే ఆకులమూలంగా చెట్టు చూడడానికి మందకొడిగా ఉంటుంది. సతతహరితమైన ఈ చెట్టుఆకులు బిరుసుగా తోలువలె ఉంటాయి. ఇవి నూగుతోను, నూగు లేకుండాను ఉంటాయి. కోడిగ్రుడ్డు ఆకారంలో ఉన్న పెద్దల్లి ఆకు అంచు నున్నగా ఉంటుంది. ఆకు మొదలునుండి కొన దాక మధ్యఈనె ఉంటుంది. పిల్లఈనెలు అంత స్ఫుటంగా కనుపించవు. ఆకు కాడిమె 6 మిల్లిమీటర్ల పొడవున ఉంటుంది. పువ్వులు అధికసంఖ్యలో బంతి ఆకారంలో ఉంటాయి. ఈ పూబంతి 3-5 సెంటిమీటర్ల వెడల్పున ఉంటుంది. ఆకుల మొదలదగ్గరగాని, ఆకులులేని కొమ్మలమీద ఆకుమచ్చల దగ్గరగాని ఈ పూబంతులు వస్తాయి. పూమొగ్గలు మొదట ఆకుపచ్చగావుండి తర్వాత లేత ధూమ్రవర్ణంగాగాని గులాబిరంగుగాగాని మారుతాయి; ఆకర్షకపత్రాలు విచ్చుకున్నాక వాటి లోపలివైపు ముదురు నీలంగా ఉంటాయి. రక్షకపత్రాలకి పొడవు 2-3 మిల్లిమీటర్లుంటుంది. కోడిగ్రుడ్డును పోలిన ఆకర్షకపత్రాలు 4 ఉంటాయి. పూర్తిగా వికసించిన ఆకర్షకపత్రాలకి వెడల్పు 5 మిల్లిమీటర్లకన్న ఎక్కువ ఉండదు. ఆకర్షకపత్రాల రంగులోనే (లేక కొద్దిగా పాలినట్లు) ఉన్న కేసరములు 8 ఉంటాయి. దీనిది మృదుఫలము; 6 మిల్లిమీటర్ల వ్యాసంతో గుండ్రంగా ఉంటుంది. కాయ రంగు ఆకుపచ్చగా (లేక ధూమ్రవర్ణంగా) ను పండురంగు నల్లగాను ఉంటుంది. వేసవిలో పువ్వులు పూస్తాయి; వర్షాకాలారంభంలో కాయలు పండుతాయి.

## వ్యాప్తి

మహాబలేశ్వర్ పీఠభూమిమీద, ముఖ్యంగా ఎన్నానరస్సు చుట్టూరావున్న పరియం అడవులలో ఎక్కువగా కనబడే చెట్లల్లో పెద్దల్లి ఒక్కటి. ఖండాలాలో చరియలలోను, బెహ్రాన్ పీఠభూమిమీద అధికంగాను పెద్దల్లి కనపడుతుంది. మథెరాన్‌లో అడవి దట్టంగా లేనిచోట్ల పెద్దల్లి కనపడుతుంది. ఈ చోటు లన్నింటా

అడవి అంతా నరికివేయబడి (నాశనం చేయబడి) న తర్వాత పెద్దల్లి ఆక్రమించింది. కనుక ఏదయినా చరియలో పెద్దల్లి కనపడింది అంటే అక్కడ అంతకుముం దొక అడవి ఉండేదని, ఆ అడవి నాశనమయిందనీ అర్థంచేసుకోవాలన్నమాట. అయితే ఈ చెట్టు వలన ఒక గొప్పలాభం ఉంది. ఇది కోతపాలయిన నేలను సంరక్షిస్తుంది.

## ఉపయోగములు

ఇతర చెట్లన్నీ నరికివేసిన కొండచరియల రక్షణలో పెద్దల్లి తోడ్పడుతుంది. పెద్దల్లి పండ్లను కరువుకాలంలో తింటారు; ఈ పండ్లు నిరపాయకరమైనవి. దీర్ఘకాలంనుండి దీని ఆకులను అద్దకపు పరిశ్రమలో వాడుతున్నారు. గడ్డిచాపలు, ఉన్ని, సిల్కు వంటి వాటి అద్దకానికిది పనికివస్తుంది. పెద్దల్లి ఆకులు కరక్కాయతో కలిపి వాడితే ముదురు ఎరుపురంగు నిస్తాయి; తగరపుదంశక ద్రవ్యము (మార్డాంట్) తో కలిపి వాడితే పసుపురంగు నిస్తాయి. ఆ దంశక ద్రవ్యాన్ని వాడకపోతే లేత గోధుమరంగు నిస్తాయి. పెద్దల్లి ఆకులను నమాయి వ్యాధికి ఔషధంగా వాడుతారు. ఈ ఆకులను ఇంకా కొన్నింటితో కలిపి పై కాపడాలకు వాడుతారు. పెద్దల్లిచెక్క గట్టిగా, చిక్కని కణములు గలదిగా ఉంటుంది. ఇది చాలకాలం మన్నుతుంది. కాని దీనితో వస్త్రంగపువని చేయడం కష్టంగా ఉంటుంది. ఇది చూడడానికి 'బాక్సువుడ్' వలె ఉంటుంది.

పెద్దల్లి[1] చెట్టుయొక్క, దాని పువ్వుల అందం ఇనుమడించడానికి మరొక్క కారణం ఉంది. అనేక 'ఆర్చిడ్' జాతులమొక్కలు పెద్దల్లిమీద పెరుగుతుంటాయి. ఖండాలా ప్రాంతంలో పెద్దల్లి మ్రానూ, కొమ్మలూ కూడా వానాకాలంలో ఆర్చిడ్ పువ్వులతోనిండిపోయి ఉండడం నేనెన్నోసార్లు గమనించాను. ఒకసారి వేము ఒక పెద్దల్లిమీద 200 'ఈరియా' ఆర్చిడ్లను లెక్కపెట్టి అక్కడితో వదలివేశాము; అంతకు మూడింతల ఆర్చిడ్లయినా ఉండివుండాలి.

మార్చినెల మధ్యలో పెద్దల్లి పూస్తుంది. తొగరుమోదుగంతగా కాకపోయినా పెద్దల్లి తన పరిసరాలను వర్ణమయంగా, నేత్రపర్వంగా చేయడంమాత్రం నిజం.

---

1. పెద్దల్లికి సంస్కృతంలో 'వనహరిణి' అని పేరట :-అను॥

# 26. శ్రీవటి

*MUSSAENDA FRONDOSA* Linn

*Family*: Rubiaceae

ఇంగ్లీషు పేరు: **MUSSAENDA**

శ్రీవటికే నాగవల్లి అన్న పేరూ ఉంది.

పడమటి కనుమలలోగాని, నీలగిరులలోగాని, డార్జిలింగ్ సమీపానగాని పయనిస్తుంటే ముదురాకు పచ్చాకులుగల పెద్దపొద లేక చిన్నచెట్టు కనుపిస్తుంది; ఈ చెట్టుమీద అక్కడక్కడ ఒక పెద్ద తెల్లఆకు కనిపిస్తుంది. ఈ తెల్లఆకు పెద్దదయిన రక్షకపత్రం అన్నమాట. ఇట్లా ఒక రక్షకపత్రం పెద్దగా, వేరుగా ఆకువలె పెరగడం 'ముస్సయెండా' గణపు లక్షణమన్నమాట. పెంచబడే వాటిలో ఇట్లా ఆకువంటి రక్షకపత్రం గల ఇతరజాతులు కొన్ని ఉన్నాయి. మనదేశంలో అట్లాటివి రెండు 'ముస్సయెండా ఫ్రాండోసా లిన్' (ఆకులు రోమయుతములు) 'ము. గ్లబ్రాటా హచ్' (ఆకులు రోమ విహీనములు) కలకత్తాలో ఒక అందమైన జాతి ఉంది. అది ఫిలిప్పీన్స్ నుండి వచ్చింది.

## వర్ణన

శ్రీవటి 2-6 మీటర్ల ఎత్తువరకు పెరిగే విటారైనపొద; లేక చిన్న చెట్టు. అప్పుడప్పుడూ అడవుల సరిహద్దులలో శ్రీవటి తన ఒంపులు తిరిగిన కొమ్మలతో ప్రాకుతుండడం చూడవచ్చును. ఇది కాఫీ (రూబియేసీ) కుటుంబమునకు చెందినది. అనగా ఆకులు జతలు జతలుగా ఎదురెదురుగా వస్తాయన్నమాట. కోడిగ్రుడ్డు ఆకారంలోవున్న ఈ ఆకు 12 సెంటిమీటర్ల పొడవున 8 సెంటిమీటర్ల వెడల్పున ఉంటుంది. ఆకు పైభాగంమీద, ఆకు అడుగునవుండే ఈనెలమీద నూగు ఉంటుంది. ఆకుమొదలు ఇంచుమించు కొనదేలిగాని గుండ్రంగాగాని ఉంటుంది.




పటము 20.   త్రివటి

చివర కొనదేలి ఉంటుంది. ఆకు మధ్య ఈనె ఇరువైపుల స్ఫుటంగా కనుపిస్తుంది. 8 జతల పిల్ల ఈనెలు మధ్యఈనెనుండి కొ_స్త వంకరగా బయలుదేరి ఆకుఅంచున పైకి తిరుగుతాయి. ఆకు పైభాగం ముదురాకు పచ్చగా క్రిందిభాగం కొంత పాలి పట్లు ఉంటుంది. పువ్వులు పెద్దవికావు. వన్యస్థితిలోని మొక్కల పువ్వులు, లోపల ఎరుపు నారింజరంగులో, బయట బూడిదరంగులో ఉంటాయి. పువ్వులు పెద్ద వదులైన గుత్తులలో పూస్తాయి. 12 మిల్లిమీటర్ల పొడవుండే రక్షకదళాలు అయి దుంటాయి. వీటిలో ఒకటి (సాధారణంగా గుత్తి వెలుపలివైపుండేది) ఆకువలె పెద్దగా పెరగ నారంభిస్తుంది. చివర కిది మామూలు ఆకు అంతది అవుతుంది. ఈ ఆకుగా మారిన రక్షకదళం మీగడ తెలుపురంగులో ఉంటుంది; రక్షకదళాలన్ని పడిపోయాక కూడా ఇది నిలిచివుంటుంది. అప్పుడిది పండు నెత్తిమీద మొలచిన ఆకువలె ఉంటుంది. శ్రీవటి పుష్పపు ఆకర్షకపత్రావళి 2·5 - 3·5 పొడవున ఉంటుంది. ఇవి అడుగున సన్నటి గొట్టంవలె ఏర్పడి, పైన వెడల్పుగా అయి, చివర నక్షత్రాకారములో పంచదళములుగా చీలుతాయి. ఈ రక్షకపత్రావళి గొట్టం యొక్క, దళాలయొక్క వెలుపలివైపులు మీగడ తెలుపుగా ఉంటాయి. వెడల్పయిన పువ్వు భాగపు లోపలివైపు మొదట ప్రకాశవంతమైన ఎరుపు నారింజ రంగులోవుండి, పిమ్మట మందకొడియైన పసుపురంగులోకి మారుతుంది; దీనినే 'బంగారపు ఎరుపు' అని వర్ణిస్తారు. దీనిది మృదుఫలము; ఇది 10-15 మిల్లి మీటర్ల పరిమాణంలో, గుండ్రంగానో, బేరికాయ ఆకారంలోనో, కోడిగ్రుడ్డు ఆకారంలోనో ఉంటుంది. మొదట ఆకుపచ్చగా పిమ్మట నల్లగా ఉంటుంది. దీని ఎర్రటి మెత్తటి గుజ్జులోపల ఎన్నో చిన్న చిన్న గింజలుంటాయి.

## గుణములు

"ఇది పేరుపొందిన మొక్క, నేలమీద పొదవలె పాకుతుంది. దీని ఎరుపు నారింజపువ్వులూ, తెల్లటి ఆకుగా మారిన రక్షకదళమూ చూడగానే ఆకర్షిస్తాయి. అన్ని పువ్వులూ ఇట్టి ప్రత్యేక రక్షకదళాన్ని కల్గివుండవు; కాని కురుచగెలలోని రెండూ మూడూపువ్వులయొక్క రక్షకదళాలిట్లా ఆకులుగా మారుతాయి. ఇట్టి 'ఆకు' లు రెండుండవచ్చును. మ. ఫ్రాందోసాను సంస్కృతంలో 'శ్రీవటి'

అంటారు. విష్ణువు లేక కృష్ణుడి తెల్లగుర్తు కల్గిన ఇది లక్ష్మీదేవికి ప్రీతిపాత్ర మైనదని అంటారు. దీనికే 'నాగవల్లి' అన్న పేరుకూడా ఉంది. గ్రామాలలో శ్రీవటి పుష్పమాలలను గుమ్మాలలో వ్రేలాడకడతారు. భారతదేశమందలి ఈ ప్రాంతాలలో ఈ మొక్కంతటినీ వాడుతారు. దీని ఆకుల పసరు, పండ్లరసము కండ్లలో పెరిగిన కండరాలను కరిగిస్తాయంటారు. ఆ పసరే, ఆ రసమే ఒంటి పైని కురుపులకు, పుండ్లకు మందుగా పనికివస్తుంది"—అని డైమాక్ తన 'హిస్టరీ ఆఫ్ ది ప్రిన్సిపల్ డ్రగ్స్ ఆఫ్ విజిటబుల్ ఆరిజిన్' అన్న పుస్తకంలో వ్రాశారు.

### పూత

వానాకాలపు ఉత్తరార్ధంలోను, శీతాకాల ప్రారంభంలోను శ్రీవటి పూస్తుంది. అయితే తెల్లటి ఆకువలె ఉండే రక్షకదళంమాత్రం ఇంచుమించు ఏడాది పొడవునా కానవస్తుంది.

విత్తనాలద్వారాగాని కొమ్మలు నాటడంద్వారాగాని దీని ప్రవర్ధనాన్ని కొనసాగించవచ్చును. లోతుగావుండి, నీరు బాగా గం నేల శ్రీవటికి అనువైనది; అయితే సారహీనమైన నేంలోకూడా శ్రీవటి పెరగగలదు.

## 27. భారతదేశమందలి కొన్ని తాటి కుటుంబపు చెట్లు

సముద్రమార్గాన భారతదేశానికి వచ్చే యాత్రికులకు మొదట తాటికుటుంబపుచెట్లు స్వాగతం చెబుతాయి. ఆ యాత్రికులు గనుక ప్రాతఃకాలాన్నే బొంబాయివైపు వస్తే, తీరప్రాంతపు ఎత్తైన తాడి, కొబ్బరి మొదలైన చెట్లమధ్యనుంచి రంగు రంగుల కిరణాలతో సూర్యుడుదయిస్తున్న సుందరదృశ్యం కనపడుతుంది. కవి, వృక్షశాస్త్రజ్ఞుడు, సామాజికశాస్త్రజ్ఞుడు, సామాన్యుడు—అందరి దృష్టినీ ఆక

క్షిందగలవి ఈ చెట్లు. అందుకనే వాటిని గురించిన కొన్ని వివరాలయినా ఇవ్వవిదే ఈ పుస్తకం సంపూర్ణం కానేరదు.

ఈ చెట్లనుగురించి ఇ. బ్లాటర్ "ది పామ్స్ ఆఫ్ బ్రిటిష్ ఇండియా & సిలోన్" (ఆక్స్ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ వారిచే ప్రచురితము) అన్న గొప్పపుస్తకంవ్రాశాడు. ఈ అధ్యాయంలోని చిత్రాలన్నీ వారి అనుమతితో ఆ పుస్తకమునుండి గ్రహింత బడినవే. ఇక్కడ ఇచ్చిన వాటికన్నా ఎక్కువ వివరాలు కావాలనుకున్నవారు ఆ పుస్తకాన్ని ఆశ్రయించడం మంచిది.

పోతే, ఈ కుటుంబపు చెట్లను చూడగానే ఏది ఏదని పోల్చుకోవడానికి ఇవిగో కొన్ని చిట్కాలు:

ఆకులు విసనకర్రలవలె, ఎంత పొడవుందో
అంత వెడల్పునవుంటే అది.................................తాటి

వెడల్పుకన్న ఎక్కువ పొడవుకల్గి, ఈకల
వలె ఉండే ఆకులు; 30 సెంటిమీటర్ల
వ్యాసంతో, మధ్య ఉబ్బి, సున్నగా, బూడిద
రంగులోవుండే కాండము—వుంటే అది..............కొండ వెలుగు

కాండము అంటూ వుండి, అది మధ్యన (లేక, దిగువ) ఉబ్బి
ఉండి, గోధుమ (లేక నల్ల) రంగులో, గరకుగా, ఉండి
దానిమీద ఆకు తొడిమెల మొదళ్లుంటే అది...........................ఈత

కాండంమీద ఉంగరాలవంటి ఆకుమచ్చలుండి
ఆకు తొడిమెల మొదళ్లు లేకపోతే అది.......................కొబ్బరి

కాండం 16-20 సెంటిమీటర్ల (అంతకన్న
తక్కువ) వ్యాసంతో ఉంటే అది...............................పోక

# తాడి

## *BORASSUS FLABELLIFER* Linn

ఇంగ్లీషుపేర్లు: **THE TAL PALM; PALMYRA PALM**

తాడి స్వస్థలము భారతదేశము. ఎగువ గంగానదీప్రాంతంనుండి దక్షిణాన కన్యాకుమారిదాకాను, దాని తర్వాతను తాడి కనబడుతుంది. బొంబాయి చుట్టుప్రక్కల కొండలమీద ఎక్కువగా కనుపించేవి తాటిచెట్లే. 'బొరాసస్' అన్నది గ్రీకుపదం; "పండని ఖర్జూరపు కాయలున్న, పెరుగుతున్న కండకంకి" అని ఈ పదానికి అర్థం.

తాడి 50-75 సెంటిమీటర్ల వ్యాసాన, 20-30 మీటర్ల ఎత్తున పెరుగుతుంది. పెరిగిన చెట్ల కాండాలమీద రాలిన ఆకుల మచ్చలుంటాయి. ఆకు విసనకర్రవలె 1-1·5 వ్యాసంకలిగి, బిరుసుగా ఉంటుంది. ఆకులో 60-100 మడతలు (విభాగాలు) ఉంటాయి; ఈ విభాగాలు గట్టిగా, మధ్యఈనె వద్ద మడతబడి ఉంటాయి. మగ, ఆడ పుష్పాలు పడవ ఆకారంలో ఉన్న చేటికలలో ఉంటాయి. పూలరెమ్మలు తియ్యటి, రుచికరమైన రసంతో నిండివుంటాయి. ఈ రెమ్మల చివర గాటుపెడితే ఈ రసం కారుతుంది. ఈ రసాన్ని కుండలలోనింపి, పులియబెడితే కల్లు తయారవుతుంది. పులియబెట్టని తాజారసాన్ని 'నీరా' అంటారు. నీరా మంచి పానీయము.

మనదేశంలోని అత్యుపయోగకరములైన చెట్లలో తాడి ఒకటి. తాటిచెట్టు కాండములను స్తంభాలుగా, వాసాలుగా వాడుతారు. దీని ఆకులతో గుడిసెలను కప్పుతారు. గొడుగులు చేస్తారు. దీనిపండ్లు చిన్నవిగా, గుజ్జు (ముంజెలు) కల్గి ఉంటాయి. ఇవి వేసవిలో తినడానికి బాగుంటాయి. తాటిచెట్టుయొక్క అన్ని భాగాలూ వంటచెఱుకుగా ఉపయోగపడతాయి. అయితే ఇవి త్వరగా మండిపోతాయి. దీనినుండి వచ్చే నీరాను పొద్దున్నే త్రాగితే ఒంటికి మంచిదంటారు. దీని కల్లు సంగతి సరేసరి! దీని పులియబెట్టని రసాన్ని కాచి, చల్లారబెట్టితే తాటి బెల్లం తయారవుతుంది. కల్లునుండి 'వినిగర్' తయారు చేయవచ్చును. 'కోలి' తెగవారు చిన్న తాటి మొక్కలను కూరగా వాడుతారు. పూర్వకాలంలో, ఇప్పుడు కాగితాలమీద వ్రాసినట్లుగా, తాటియాకులమీద ఘంటాలతో వ్రాసేవారు.



పటము. 21. (అ) జీలుగచెట్లు
(చూడు : పుట 89)



పటము. 21. (అ) పోక

(చూడు : పుట 91)



పటము. 21. (అ) ఈత

(చూడు: పుట 72)



పటము. 21. (ఈ) కొబ్బరి
(చూడు : పుట 93)

తాడి 100 సంవత్సరాలు లేక అంతకన్న ఎక్కువకాలం జీవించగలదు. అయితే వాటిమీద నివసించే రాబందుల రెట్టల ప్రభావంచేత తాటిచెట్లు నాశనమవుతుంటాయి. మఱ్ఱిగింజలు తాటిచెట్టులోని ఏ సందులోనో పడి, పెరిగి, క్రమంగా తాడిని నులిమి చంపివేస్తాయి.

"పూర్వం తమ పవిత్ర గ్రంథాలన్నీ తాళపత్రాలమీద వ్రాయబడిన కారణంగా తాటీలు, హిందువులు, బౌద్ధులూకూడా తాటిచెట్టును గౌరవంగా చూస్తారు :" అని బెంథాల్ తన "ట్రీస్ ఆఫ్ కలకత్తా" అన్న పుస్తకంలో వ్రాశాడు.

## జీలుగచెట్టు

*CARYOTA URENS* Linn

*ఇంగ్లీషు పేర్లు* : **THE FISH-TAIL PALM; INDIAN SAGO PALM**

జీలుగకు మారుపేర్లు చాలవున్నాయి; అవి చిరుగు, జిగురు, జీలిక, జీవలగ్గు, బకిని, మర్ది, మారె, యూత్రకటారి, యాదరికొడారి.

'కెర్యోటా' అన్న గ్రీకుపదానికి 'కాయ (గింజ) వంటిది' అని అర్థం.

జీలుగచెట్టు సాధారణంగా 6-10 మీటర్ల ఎత్తున ఉంటుంది; అప్పుడప్పుడూ 40 మీటర్ల వరకూకూడా పెరుగుతుంది. దీని కాండం 30 సెంటిమీటర్ల వ్యాసాన, నున్నగా, బూడిదరంగులో ఉంటుంది. ఆకులు ఇతర తాడి కుటుంబపుచెట్లకువలనే, ద్విభిన్నపక్షాకారంగా, 5 మీటర్ల పొడవుతో, 3-4 మీటర్ల వెడల్పుతో ఉంటాయి. ఉపదళాలు చేపతోకవలె ఉంటాయి; ఈ ఉపదళాల ఈనెలు బలిష్ఠంగాను సమానాంతరంగాను ఉంటాయి; ఇవి అంచున రంపగరితో ఉంటాయి. 1·8 సెంటిమీటర్ల వెడల్పుగల దీని పండ్లు గట్టిగా ఉంటాయి.

భారతదేశానికి చెందిన జీలుగచెట్టు దిగువ హిమాలయప్రాంతంనుండి దక్షిణాదిదాక కనపడుతుంది. పడమటి కనుమలలో విచ్చలవిడిగా పెరిగే తాటికుటుంబపు చెట్లలో జీలుగ ఎక్కువగా కనపడుతుంది. దీనిని తోటలలో పెంచుతారు; జీలుగ చెట్లు పిన్నవయసున చూడ చక్కగా ఉంటాయి.

జీలుగచెట్టు బహుళ ప్రయోజనకారి. దీని ఆకు నారతో, పూలరెమ్మల నారతో గట్టి త్రాళ్లను పేనుతారు; గట్టిగావుండే బురుసులను తయారుచేస్తారు. దీని కాండంనుండి తీసేపిండి సగ్గుబియ్యపుపిండివలె ఉంటుంది. కరువుకాలంలో కొంతప్రాంతాలవారు ఈ పిండిని తింటారు. దీని లేత శిఖరాంకురము (కొసనువున్న మొగ్గ) తినడానికి బాగుంటుంది. దీని చెక్క గట్టిగా ఉంటుంది; బాగా మన్నుతుంది. దీని పండ్లను కోసినా, తాకినా దురద, మంట పుడుతాయి; అందువలననే కాటోలు 'యురెన్స్' (మంటకల్గించు) అన్న పేరువచ్చింది. ఈ విషయంగురించి బ్లాటర్ ఇట్లా అంటాడు. "నేనెప్పుడూ దీనిపండును తినలేదు; కాని ఒకసారి నా దగ్గర వృక్షశాస్త్రం చదువుతున్న విద్యార్థులను జీలుగపండును కోయమన్నాను. కాని కాస్సేపుతర్వాత వారా పనిని చేయలేక విడిచిపెట్టారు. వారిచేతులు దూలగొండిని ముట్టుకున్నట్లు కనుపించాయి. పాపం, వారు రెండుగంటలసేపు దురద మంటలతో బాధపడ్డారు. "నేనుకూడా ఈ పండును చాలాసార్లు తిన్నాను; తిన్నప్పుడెల్లా కొన్ని గంటలసేపు నాలుక దురద, మంటలతో చిమచిమలాడింది.

తోటలో, పెద్ద పూలకుండీలలో, చిన్న జీలుగమొక్కలు చూడడానికి బాగుంటాయి. ఎటువంటి నేలలోనయినా పెరగగల జీలుగ మంచినేలయితే ఏపుగా పెరుగుతుంది. 15 సంవత్సరాలలో జీలుగ పూర్తిగా పెరుగుతుంది; ఆ తర్వాత 7 సంవత్సరాలు ఇది పువ్వులు పూస్తుంది. అటుపిమ్మట పనికిరాకుండా తయారవుతుంది. దీని మొదటి పూలరెమ్మగుత్తి పెద్దగా, పై ఆకులలో ఒకదాని చంకనుండి వ్రేలాడుతుంది. రెండవ పూల రెమ్మగుత్తి మొదటిదానికన్న చిన్నదిగా, మొదటిదానికి క్రిందుగా వస్తుంది. ఇదేవిధంగా చెట్టుపొడవునా పూలగుత్తులు పూస్తాయి. వయసు ముదిరిన చెట్లు వికారంగా ఉంటాయి. 3-4 మీటర్ల ఎత్తునవుండే చిన్న చెట్లే అందంగా ఉంటాయి.

మనదేశంలో ఆహారపు కొఱతను తగ్గించడానికిది తోడ్పడుతుంది అన్న ఉద్దేశంతో కలకత్తా బొటానికల్ గార్డెన్ వ్యవస్థాపకుడయిన కల్నల్ ఆర్. కిడ్ జీలుగచెట్టును ఆ తోటలో నాటాడు. అప్పటినుండి ఇది ఆ తోటలో పెరుగుతూనే ఉంది.

## పోక

*ARECA CATECHU* Linn

ఆంగ్లపు పేర్లు: THE BETEL-NUT PALM; ARECA-NUT PALM

పోకనే ఒప్పులు, వక్క, క్రాముకము, చికినము అన్న పేర్లతో పిలుస్తారు.

'అరిక' అన్నది 'కాయలగుత్తి' అన్న అర్థాన్నిచ్చే తమిళపదానికి రూపాంతరము. దీని స్వస్థలమేదో తెలియదు. కోస్తాప్రాంతాలలో, సముద్రతీరంనుండి 800 కిలోమీటర్ల దూరంవరకు పోకతోటలను వేస్తారు. పోకచెట్టు నిటారుగా, 30 మీటర్ల ఎత్తుకు, 15 సెంటిమీటర్ల మందాన పెరుగుతుంది. ఆకులు 1-1½ మీటర్ల పొడవున కొబ్బరిఆకులవలె ఉంటాయి. దీనిపండ్లు ఎర్రగా, ఇంచుమించు గుండ్రంగా, 3-5 సెంటిమీటర్ల వెడల్పున ఉంటాయి. దీనినుండి లభించే వక్కలకోసమే దీనిని పెంచుతారు. రైతులు ఒక పోకచెట్టు మీదికి ఎక్కి, ఆ చెట్టును విదిలించి పండ్లను రాలుస్తారు. అక్కడినుండే ప్రక్కనున్న చెట్లను కూడా పట్టుకుని విదిలిస్తారు. ఈ విధంగా ప్రతిచెట్టునూ ఎక్కి దిగి కష్టపడకుండా పండ్లను రాలుస్తారు. పోకచెట్లను దగ్గర దగ్గరగా పెంచుతారు. పోకచెట్లకు బలంగావీచే గాలి తగలకుండా తగు రక్షణ కల్పిస్తారు. పోకచెట్లు పెరిగే నేలలోని తేమ ఆరిపోకుండా ఉండడానికవి అరటిచెట్లవంటి వాటిని పెంచుతారు.

పోకపండ్లకు భారతదేశంలో వాణిజ్యవిలువ ఉంది. పోకచెక్కలను (వక్కలను) తమలపాకులతో, పొగాకుతో కలిపి తాంబూలంగా వేపిస్తారు. దీని గట్టికర్రచాల విలువైనది. దీని ఆకులను గుడిసెలను కప్పడానికి వాడుతారు.

## ఈత

*PHOENIX SYLVESTRIS* Roxb

ఇంగ్లీషు పేరు: **THE WILD DATE PALM**

ఈతపండుయొక్క ధూమ్రవర్ణమునుబట్టి 'ఫీనిక్స్' అన్న గ్రీకుపదం వచ్చింది.

ఈత మనదేశపుచెట్టు. అయితే దీని ఆకుల తొడిమెల మొదళ్లు ఉండిపోయి, చెట్టు చూడడానికి వికృతంగా తయారవుతుంది. ఆ కారణంచేత దీనిని వీధుల వెంబడి పెంచరు. దీని రసంనుండి చక్కెరను తయారు చేస్తారు; ఈతకల్లు సుప్రసిద్ధమైనది. ఈతపండులో గుజ్జు ఎక్కువగా ఉండదు; గట్టిగింజ ఉంటుంది.

## కొండవెలుగు

*ROYSTONEA REGIA* Cook

ఇంగ్లీషు పేర్లు: **THE MOUNTAIN GLORY; THE BOTTLE PALM**

కొండవెలుగుకే 'Oreodoxa regia Kunth' అన్న శాస్త్రీయనామమూ ఉంది. తాడి కుటుంబపు అందమైన చెట్లలో ఇది ఒకటి; దీనిని తోటలలో, వీధులలో పెంచుతారు. దీని కాండము సున్నగా బూడిదరంగులో ఉంటుంది. కాండమంతా ఒకే పరిమాణంలో ఉంటుంది; కాండం చివర, ఆకుల క్రిందిభాగం మాత్రం కొద్దిగా ఉబ్బిఉంటుంది. కొండవెలుగు వెస్టిండీస్‌కు చెందిన క్యూబా ప్రాంతపు చెట్టు; అయితే ఇప్పుడు ప్రపంచంలోని ఉష్ణమండల ప్రాంతాలన్నిటా వ్యాపించిఉంది. క్యూబాలో దీని ఆకులను కూరగా తింటారు. కొండవెలుగు మనదేశంలోకి ఎప్పుడు వచ్చిందో చెప్పలేను. కాని బొంబాయిలోని తోటలలో 1861 సంవత్సరంనాటికి ఇది పెరుగుతుండేదని చెప్పడానికి ఆధారాలున్నాయి. ఇక పోతే భారతదేశంలోని ఏ ఇతరప్రాంతంలోను 1864 ముందర కొండవెలుగు ప్రసక్తి లేదు; 1864 లో బెంగాల్ కలకత్తాలోని చెట్లలో దీని నొకదానినిగా పేర్కొన్నారు.

# కొబ్బరి

## *COCOS NUCIFERA* Linn

### ఆంగ్లపుపేరు : THE COCONUT PALM

### కొబ్బరినే టెంకాయ అని కూడా అంటారు

భారతదేశపు కోస్తాప్రాంతాలవారికి కొబ్బరిచెట్టు సుపరిచితమైనది. అయినా దీనిని గురించిన వివరాలు కొన్ని అందరికీ తెలియవు గనుక ఈ పుస్తకంలో కొబ్బరికి చోటివ్వడం జరిగింది

### ఆదిమనివాసము

ఎన్నోశతాబ్దాలనుండి మనదేశంలో పెరుగుతూంది గనుక కొబ్బరి మనదేశపు చెట్టు అని మనం అనుకుంటాము. కాని అది సరికాదు. అయితే కొబ్బరి స్వస్థలం ఏదో ఇదమిత్థమని నిర్ణయం కాలేదు. 'కోకోస్' గణానికి చెందిన ఇతరజాతులన్నీకూడా దక్షిణ, లేదా మధ్య అమెరికాకు చెందినవై ఉన్నాయి గనుక కొబ్బరి కూడా ఆ ప్రాంతందే అయివుండాలంటారు. అక్కడినుండి కొబ్బరికాయలు పసిఫిక్ సముద్రతరంగాల ధర్మమా అని భారతదేశాన్ని చేరుకుని ఉండవచ్చునని ఊహ. అయితే కొబ్బరి ఇట్లా వ్యాప్తిచెందడం అన్నది అనేక శతాబ్దములకు పూర్వం జరిగింది గనుక దానిని గురించిన ప్రసక్తి అటు పసిఫిక్ ద్వీపాలవారి సాంప్రదాయక గాథలలోగాని ఇటు భారతదేశపు పుస్తకాలలో గాని లేనేలేదు.

### వర్ణన

కొబ్బరి, కొమ్మలులేని పొడవైన చెట్టు. 10-25 మీటర్ల ఎత్తుకు నిటారుగా గాని, కొద్దిగా వంకరగాగాని పెరుగుతుంది. కాండంచుట్టు ఉంగరాలవంటి ఆకు మచ్చలుంటాయి. మామిడివంటి చెట్లవలె కొబ్బరిచెట్టు కాండపు చుట్టుకొలత పెరగదు. ఈ కొలత క్రిందినుంచి పైదాకాకూడా ఒకే పరిమాణంలో, 40-70 సెంటీమీటర్లుంటుంది. 2-4 మీటర్ల పొడవైన ఆకులు చూడడానికి ఈకలవలె ఉంటాయి.

ఆకు మధ్యన లావుపాటి ఈనె ఉంటుంది; ఈనె కటూ ఇటూ కూడా అనేక ఉప దళములుంటాయి. ఆకుపచ్చగావుండే ఈ ఉపదళాలు 100 దాకా ఉంటాయి. ఇవి 60-80 సెంటిమీటర్ల పొడవున, బిరుసుగా, మెరుస్తూ ఉంటాయి. 60 సెంటి మీటర్ల పొడవున్న పడవ ఆకారపు చేటికలలో పువ్వులు పూస్తాయి. మగపుష్పాలు 12 మిల్లీమీటర్లకన్న ఎక్కువ పెడల్పుండవు; ఆడపుష్పాలు 25 మిల్లీమీటర్ల పెడ ల్పున పొడవుగా ఉంటాయి. దీనికాయ (అదే మనం వాడే కొబ్బరికాయ) 20-30 సెంటిమీటర్ల పొడవున, కొంతతక్కువ వెడల్పున మూడు పలకలుగా ఉంటుంది. ఈ కాయ పై భాగం మొదట ఆకుపచ్చగా, గట్టిగా మెరుస్తూ ఉంటుంది. దీనిక్రింద 25 మిల్లీమీటర్ల మందాన గట్టి పీచుంటుంది. ఈ పీచుతో త్రాళ్లను పేనుతారు. పీచుక్రింద 6 మిల్లీమీటర్ల మందాన గట్టి పెంకు లేక చిప్ప ఉంటుంది. ఈ చిప్ప లోపల తెల్లటి మెత్తటి గుజ్జు లేక కండ ఉంటుంది. దీనిమధ్య నీరుంటుంది; అదే మనం త్రాగే తియ్యటి కొబ్బరినీరు

## పెంపకము

తేమ, నీరు, ఉన్నచోట త్రవ్విన గోతిలో చిలికిన ఆకులువేసి కొబ్బరికాయను పీచుతోసహా పాతిపెడితే అది మొలకెత్తుతుంది. కొబ్బరికాయను నీటిలో నానబెట్టి, దానిక్రొత్తవేళ్లు పీచుగుండా బయటికి వచ్చాక, నేలలో నాటితే మొలక త్వరగా వస్తుంది. కొబ్బరిమొలకకూ మొలకకూ మధ్య 4-5 మీటర్ల దూరం ఉండాలి. మొదట కొన్ని సంవత్సరాలదాక కొబ్బరిమొక్కలకు నీరు బాగా పెట్టాలి. 5-7 సంవత్సరాలలో కొబ్బరిచెట్లు కాపుకు వస్తాయి. తోటలోని మిగతా చెట్లన్నింటిని మించిపోయేదాక కొబ్బరిచెట్లు అందంగా ఉంటాయి.

## ఉపయోగములు

కొబ్బరివలె వివిధ ప్రయోజనములుగల చెట్టు మరొక్కటి లేదు. కొబ్బరిచెట్ల నుండి కల్లు తీస్తారు. ఈ కల్లునుండి బెల్లం చేస్తారు. కొబ్బరిఆకుల ఈనెలతో కొబ్బరి చీపుళ్లు కడతారు. కొబ్బరికాయలను పూజలో, వంటలో ఉపయోగిస్తారు. కొబ్బరినీళ్లను చల్లటి పానీయంగా సేవిస్తారు. కొబ్బరి పీచుతో త్రాళ్లు, చాపలు

చేస్తారు. కొబ్బరి నెండబెట్టి కొబ్బరిగా అమ్ముతారు. కొబ్బరినుండి తీసిననూనెను తలకు రాసుకోవడానికి, వంటకు వాడుతారు.

అందచందాల విషయంలో అలంకరణ విషయంలో అధికంగా శ్రద్ధవహించే నవనాగరికులకు, యవ్వనంపు దీప్తిని పునః పొందాలని ఉవ్విళ్లూరే ముసలివారికి ఆసక్తికరమైన ఉపయోగం ఒకటి ఉన్నది. కొబ్బరినీళ్లను రోజూ త్రాగితే "దేహంమీద ముడతలూ అవీ పోయి కళకళలాడే యవ్వనపు గులాబీలు పూస్తాయి"ట।

కోస్తాప్రాంతపు అందమైన చెట్లలో కొబ్బరి ఒకటి. బొంబాయి ద్వీపపు ఉత్తరభాగంలోని వీధులలో కనపడే కొబ్బరిచెట్ల వరుసలు కన్నుల పండువుగా ఉంటాయి.

1589 లో మనదేశానికి వచ్చిన జెసూట్ మతాచార్యుడు పా॥ స్టీఫెన్స్ పారిస్ లోని తన సోదరుడికి వ్రాసిన ఉత్తరంలో కొబ్బరిని గురించి ఈ విధంగా వ్రాశాడు: "ఈ దేశంలో తాటిచెట్టువంటి చెట్టొకటి ఉంది. అది నూనెను, కల్లును, పాలను, తేనెవంటి చక్కెరను, వినిగర్‌ను ఇస్తుంది. త్రాళ్లను పేనడానికి పనికి వచ్చే పీచునిస్తుంది. కుటీరాలను వర్షాలనుంచి కాపాడగల కప్పులు వేయడానికి దాని ఆకు ఉపయోగపడతాయి. అది సంవత్సరం పొడవునా కాయలు కాస్తుంది. ఈ కాయ ఒక్కొక్కటి మనిషి తలకాయంత ఉంటుంది. దీనిలోని పీచు తీసివేస్తే అది రెండు పిడికిళ్ల పరిమాణంలో ఉంటుంది. ఈ కాయలోపల 'బీర్' వంటి, ఆహ్లాదకరమైన పానీయం ఉంటుంది, ఈ కాయలోపల తినడానికి బాగుండే 'పదార్థం' ఉంటుంది. గ్రామంలోని కమ్మరికి ఈ కాయల పెంకులే బొగ్గుగా పనికి వస్తాయి. తీరప్రాంతాలలో నివసించేవారు ఓడలలో ఈ కాయలను గుట్టలు గుట్టలుగా పోసి రవాణాచేస్తారు. ఈ చెట్టు ఆకులమీద ఉత్తరాలు వ్రాస్తారు. పొలాల్లో పనిచేసేవారిని వాననుండి కాపాడేవి ఈ ఆకులగొడుగులే।"

[ఈ అధ్యాయం చివర ఇచ్చిన చిత్రాలన్నీ ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ వారిచే ప్రచురితమయిన ఇ. బ్లాటర్ వ్రాసిన "ది పామ్స్ ఆఫ్ బ్రిటిష్ ఇండియా అండ్ సిలోన్" అన్న పుస్తకంనుండి అనుమతి పూర్వకంగా గ్రహించబడినవి.]

# 28. కొండచింత

## *PELTOPHORUM PTEROCARPUM* (DC.) Backer

(*Family*: Caesalpiniaceae)

ఇంగ్లీషు పేర్లు: **THE RUSTY SHIELD-BEARER; THE COPPER POD**

ఏప్రిలు నెలాఖరున మన నగరపు వీధులలో పసుపు పచ్చటి పువ్వులతో కళకళ లాడుతూ వుంటాయి కొన్ని చెట్లు. ఆ చెట్లచుట్టూ నేలమీద పువ్వులు రాలి పసుపు తివాసీవి పరిచివుంటాయి. ఆ కాలంలో పూతమీద వుందేవి ఈచెట్లు మాత్రమే గనుక వీటి అందం కొట్టవచ్చినట్లు కనపడుతుంది. ఇవే కొండచింత చెట్లు.

### పేర్లు

కొండచింతయొక్క శాస్త్రీయనామము చాల మార్పులు చెందింది. దీనిని Peltophorum ferrugineum అని వ్యవహరించేవారు దీనికే P. inerme. P. roxburghii, P. Pterocorpum అన్న శాస్త్రీయనామములూ వున్నాయి. దీని ఇంగ్లీషుపేరు దీని శాస్త్రీయనామమునకు అనువాదం అన్నమాట. డాలువంటి దీని పుష్ప కీలాగ్రమునుబట్టి 'షీల్డ్ బేరర్' అన్న పేరు వచ్చింది. 'ఫెర్రూగినమ్' అనగా 'రస్టీ' (త్రుప్పువంటి) అని అర్థము; ఇది కొండచింత మొగ్గల, పండ్ల రంగునుబట్టి వచ్చిన పదము. ఈ చెట్టుయొక్క మరొక ఇంగ్లీషుపేరయిన 'కాపర్‌పాడ్' కూడా దీని కాయరంగు పాతబడిన రాగివలె వుండడం కారణంగా ఏర్పడింది. 'టెరోకార్పమ్' అంటే 'రెక్కలుగల ఫలములు గలది' అని భావము.

### ఆదిమనివాసము

సింహళము, దానికి దక్షిణంగా వున్న ప్రాంతం తూర్పున మలయా, ఆస్ట్రేలియా ఉత్తరభాగాలు—ఇవి కొండచింతయొక్క ఆదిమనివాసస్థలాలు. మన




పటము 22. కొండచింత

దేశంలోకి ఈ చెట్టు ఎప్పుడు వచ్చిందో కనుగొందామని నేను చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. 19 శతాబ్దారంభంనాటికి. మలక్కాస్‌నుంచి తెచ్చిన విత్తనాల నుండి మొలిచిన చెట్లు కలకత్తా బొటానికల్ గార్డెన్స్‌లో పెరుగుతున్నాయి. బొంబాయిలోని చెట్లనుగురించి 19 వ శతాబ్దంలో ప్రచురింపబడిన పుస్తకాలలో కొండచింత ప్రసక్తే లేదు. 50 సంవత్సరాల కాలంలో కొండచింత పశ్చిమభారత దేశమంతటా వ్యాప్తిచెంది ప్రజామోదానికి పాత్రమవడం చెప్పుకోదగిన విశేషం.

## వర్ణన

అన్ని పరిస్థితులూ అనుకూలంగా వుంటే కొండచింత 10-15 మీటర్ల పొడ వున, విస్తరించిన కొమ్మలతో, దట్టంగా ఆకులతో గుబురుగా పెరుగుతుంది. వేస విలో ఇది చల్లటి నీడనివ్వగలదు. ఆ కారణంచేతనే దీనిని వీధుల ప్రక్కల నాటు తారు. కొండచింత ఆకురాల్చు చెట్టు. డిసెంబరు జనవరి నెలలలో ఇది ఆకులు రాలుస్తుంది. ఆ వెంటనే చిగురించడం మొదలుపెడుతుంది. ఫిబ్రవరి నెలాఖరుకు చెట్టంతా ఆకులతో నిండిపోతుంది. కొండచింతది భిన్నపత్రము. 25 సెంటిమీటర్లు, లేక అంతకన్నా పొడవుగల ఈ భిన్నపత్రం మధ్య కాడవుంటుంది; దాని కిరు వైపుల 5-15 జతల ఉపదళాలుంటాయి. ఒక్కొక్క ఉపదళానికి 10-12 సెంటి మీటర్ల పొడవుగల చిన్నతొడిమె, 10-12 జతల పిల్లదళాలు వుంటాయి. ఈ పిల్లదళాలు గుబురుగా, మొదట ప్రకాశవంతమైన ఆకుపచ్చ రంగులోను, ఆ తర్వాత ముదురాకు పచ్చరంగులోను వుంటాయి. ముదిరాక ఇవి బిరుసుగా వుంటాయి. ఇవి నిడివి వాటంగా, కొనను గుండ్రంగాగాని సొట్టపడిగాని వుంటాయి. ఫిబ్రవరి నెలాఖరున పువ్వులు పూయడం మొదలుపెడతాయి. ఏప్రిలు రెండవ వారంపాటికి చెట్టంతా పువ్వులతో సింగారింపబడి వుంటుంది. వర్షాకాలారంభందాక పూత వుంటూనే వుంటుంది. ఆకులు లేకుండావున్న కొమ్మల చివరిరెమ్మలమీద మొదట మొగ్గలు వస్తాయి. త్రుప్పుపట్టినట్లున్న ఈ మొగ్గలు పెద్ద రెమ్మగుత్తులుగా వ్రేలాడుతుంటాయి. ఈ మొగ్గలపై నూగుంటుంది. మొగ్గలు వికసించగానే రక్షక పత్రాలు మధ్యనుండి వెనక్కు మడుచుకుంటాయి. అప్పుడివి చూడడానికి ఆకు

పచ్చగా వుంటాయి. ఆకర్షకదళాలు 25 మిల్లీమీటర్ల వెడల్పైన కాంతివంతమైన పసుపురంగులో, రంపగరి అంచులతో మొదలువద్ద కొనదేరి, అంచున వెడల్పుగా వుంటాయి. కేసరములు పదివుంటాయి; సన్నటి పోగుల చివర నారింజ పసుపు రంగు పుప్పొడి తిత్తులుంటాయి; ఈ పోగులమొదళ్లు నూగు కలిగివుంటాయి. సన్నటి పోగువంటి కీలంచివర గుండ్రటి, ఆకుపచ్చటి కీలాగ్రం వుంటుంది. ఈ కీలాగ్రం తిరగవేసిన డాలువలె (లేదా, గొడుగువలె) వుంటుంది. కాయలు మందంగా 5-10 సెంటిమీటర్ల పొడవున, 19-20 మిల్లీమీటర్ల వెడల్పున వుంటాయి. ఇవి పాతబడిన రాగి రంగులో, (తుప్పు పట్టినట్లున్న గోధుమ రంగులో) వుంటాయి. సంవత్సరం పొడవునా (ఆకులు లేనప్పుడు కూడా) కాయలు చెట్లమీదే వుంటాయి. అయితే ఇవి క్రమంగా నల్లబడిపోతాయి.

## పూత

పూత ఫిబ్రవరిలో మొదలుపెట్టి, జూన్ దాక సాగుతుంది. కొన్ని చెట్లు కొత్త ఆలస్యంగా పూయడం మొదలు పెడతాయి: అటువంటిచెట్లు వర్షాకాల ఆరంభం తర్వాత కూడా పువ్వులు పూస్తాయి. బొంబాయిలోని కొన్ని కొండచింతచెట్లు వర్షర్తు అంతంలో రెండవసారి పూయడం మొదలు పెడతాయి. ఈ పువ్వులు అక్టోబరు నవంబరు నెలలంతా వుంటాయి.

## పెంపకము

విరివిగా లభించే కొండచింత విత్తనాలను నాటి ఈ చెట్లను సులభంగా పెంచవచ్చును. నారు మళ్లల్లోగాని పూలకుండీలలోగాని విత్తనాలు నాటాలి. మొలకెత్తిన మొక్కలు 1-2 మీటర్ల ఎత్తుకు పెరగగానే వాటిని నేలలో నాటవచ్చును. వానలు పడడం ఆరంభించగానే నాటడం మంచిది.

కొండచింతను వీధులలో ఎర్రతురాయి లేక బాండుగతోబాటు నాటి పెంచుతారు. ఇవి రెండూ కూడా ఇంచుమించుగా కొండచింతతోబాటే పూతకు వస్తాయి. ఇట్లా నాటిన వీధులు పీటి పసుపు, ఎరుపు, నారింజ ఎరుపు రంగుల పూవులు కట్టిన దండలవలె మనోహరంగా వుంటాయి.

# 29. అశోక

*POLYALTHIA LONGIFOLIA* (Sonn) Thw.

(*Family* : Annonaceae)

ఆంగ్లపుపేర్లు : **ASHOK ; INDIAN FIR ; MAST TREE**

'పొల్యాల్తియా లాంగిఫోలియా'ను భారతీయ భాషలలో అశోపలవ్ అనీ, అశోక మనీ అంటారు. అయితే ఈ 'అశోక' నామము పవిత్రమైనదిగా భావించబడే 'Saraca Indica' (దీనినే 'Jonesia Asoka' అనేవారు) కు కూడా వుండడం వలన కొంత గందరగోళం ఏర్పడుతుంది.[1] 'పొల్యాల్తియా'కే తెలుగులో 'జంబూల దేవదారు' అన్న పేరూ వుంది; 'నెట్టిలింగం' అన్న పేరూ వుంది. 'పొల్యాల్తియా' అన్నది గ్రీకుభాష ఆధారంగా వచ్చినది. 'పోలీ' అనగా 'అనేక మైన' అనీ, 'అల్తాయనో' అనగా 'నివారించు, ఉపశమింపజేయు' అనీ, 'లాంగి ఫోలియా' అనగా 'పొడుగాటి ఆకులు గలది' అనీ అర్థము.

### ఆదిమ నివాసము : ఉపయోగములు

ఈ 'అశోక' (జంబూల దేవదారు) చెట్టు దక్షిణభారతదేశానికి సింహళానికి చెందినది. బొంబాయిలో ఇది వంద సంవత్సరాలనుండీ పెరుగుతూంది. భారత దేశంలో చాలచోట్ల దీనిని అసలు అశోక వృక్షానికి తర్వాత అతి పవిత్రమైనదిగా భావిస్తారు ; దేవాలయాల దగ్గర నాటుతారు. దీని ఆకులను గుమ్మాలకు తోర

1. రామాయణంలో చెప్పినట్లు సీత కూర్చుని ఏడ్చినది (అశోకవృక్షము) Saraca - indica క్రింద దీనినే లషింగ్టన్ 'Heart-ease tree of Mahabharatha'అనీ, Sorrow-less tree' అనీ వర్ణించారు. 'పొల్యాల్తియాలాంగిఫోలియా'ను అశోకచక్రవర్తి ఎక్కు వగా నాటించినందున దానికి 'అశోక' మనే పేరు స్థిరపడింది. స్పష్టత నిమిత్తం 'పొల్యా ల్తియా లాంగిఫోలియా'ను - 'జంబూల దేవదారు' అన్న పేరుతో వ్యవహరించడం మేలేమో । - అను॥



పటము. 19. వెర్రివేప
(చూడు : పుట 78)



పటము. 23. అశోకము
(చూడు : పుట 100)

జాలుగా కడుతారు. దీని చెక్క తేలికగా వుంటుంది; ఈ చెక్కతో 'డ్రమ్ము'లు చేస్తారు. ఈ చెట్టు పండ్లను పక్షులూ కోతులూ తింటాయి; కరువుకాలంలో మను మ్యలూ తింటారు.

## వర్ణన

శీవిగా వుండే ఈ సతత హరిత వృక్షము, అనుకూల పరిస్థితులలో 15 మీటర్లు, అంతకన్న ఎక్కువ ఎత్తుకు పెరుగుతుంది. ముదురాకులు బిరుసుగా వుంటాయి. ఆకులు సన్నటి బల్లెపు కొసవలె, నూగులేక, ఇరుపైపుల తళతళ లాడుతూ వుంటాయి. అంచులు నొక్కులతో వుంటాయి. మధ్య ఈనె బలిష్ఠంగా ఆకు మొదలునుండి కొనదాక ఉంటుంది, ఈ మధ్య ఈనె కిరుపైపుల కనపడీ కనపడకుండా 20-30 జతల పిల్ల ఈనెలు ఐ మూలగా వుంటాయి. ఆకుల ఆకారము, అవి క్రిందికి వాలి వుండడమూ - ఈ రెండు కారణాలబట్టి 'అశోక' (జంబూల దేవదారు) చెట్టు యొక్క ఆదిమ నివాసస్థలము అధిక వర్షపాతప్రాంత మయివుంటుందని ఊహించవచ్చును. మన్నగా, వాలివుండే ఈ ఆకులు వాన నీరుని సులభంగా క్రిందికి కార్చివేస్తాయి. 5-6 పువ్వులు కలిసి గుత్తిగా పూస్తాయి. ఒక్కొక్క పూతొడిమె 2-5 సెంటిమీటర్ల పొడవున వుంటుంది. రక్షకపత్రాలు ముక్కోణాకారంగా, విస్తరించివుంటాయి. ఇవి ఆకర్షక పత్రాలతో పోల్చితే చాల చిన్నవిగా, 6 మిల్లిమీటర్లకు మించని పొడవున వుంటాయి. ఆకర్షక పత్రాలు 2-5 సెంటిమీటర్లు లేక అంతకన్న ఎక్కువ పొడవున, 6 మిల్లిమీటర్ల వెడల్పున వుంటాయి. ఇవి ఆకుపచ్చగా, విస్తరించి వుంటాయి. కాయలు 18 మిల్లిమీటర్ల పొడవున 6 మిల్లిమీటర్ల వ్యాసంతో వుంటాయి. ఇవి కాయలుగా వుండగా ఆకు పచ్చగాను, పండినాక ధూమ్రవర్ణంలోను వుంటాయి. పండ్లు క్రిక్కిరిసివున్న గుత్తిగా వ్రేలాడుతుంటాయి. ఈ చెట్టు ఫిబ్రవరిలో పూలు పూస్తుంది; ఆగస్టు సెప్టెంబరులో దీని కాయలు పండుతాయి.

## పెంపకము

అశోక (జంబూల దేవదారు) ఆకులు ఇచ్చే నీడకోసమే దానిని వీధుల వెంబడి పెంచుతారు. దీని పువ్వులు గాని కాయలు గాని చెప్పుకోదగినవి కావు.

ఈ చెట్టు నిదానంగా పెరుగుతుంది; అంటే దీని చెక్క గట్టిగా వుంటుంది; ఇది వానకు గాలికి తట్టుకుని నిలబడగలదు. గింజలలోని అంకురణశక్తి ఎక్కువ కాలం నిలిచివుండదు. కనుక తాజా విత్తనాలనే నాటాలి. నారు పోసి పెంచితే ఇది సరిగా పెరగదు. కనుక దీని విత్తనాలను తిన్నగా చెట్టు ఎక్కడ పెరగాలో అక్కడ నాటడం మంచిది. లేదా బుట్టలలో విత్తి, శ్రద్ధగా పెంచి, ఆ మొక్కల వేళ్ళ కెట్టి దెబ్బ తగలకుండా జాగ్రత్తగా నాటవచ్చును.

ఒక రకపు అశోక (జంబూల దేవదారు) చెట్టును ఇటీవల వీధులవెంబడి ఎక్కువగా పెంచుతున్నారు. ఈ చెట్టు కొమ్మలు ఎక్కువగా విస్తరించక ప్రధాన కాండాన్ని అంటిపెట్టుకుని వుండడం వలన ఇది చూడడానికి చక్కగా, గోపురంలా వుంటుంది. దీనిని తోటలలో, బాటల అంచులలో నాటి పెంచుతారు. ఇది దక్షిణ యూరపుకు చెందిన 'ఎవర్లాస్టింగ్ సిప్రస్' కన్న అందంగా వుంటుంది.

## 30. పుత్రజీవిక

*PUTRANJIVA ROXBURGHII* Wall.

(*Family :* Euphorbiaceae)

ఇంగ్లీషు పేరు: **PUTRANJIVA**

పుత్రజీవిక చెట్టుకే - మహాపుత్రజీవి, కుదురుజీవి, కుదురు, వేకు, వేకల, యూరాల - అన్న పేర్లున్నాయి.

"'పుత్ర' అనగా కొడుకు; 'జీవ' అనగా ప్రాణము. మద్రాసుకు చెందిన డాక్టర్ బెర్రీ, పుత్రజీవిక కాయలను అక్కడ బజారులో అమ్ముతారని వ్రాశారు. ఆ కాయలను దండగా గుచ్చి తలిదండ్రులు తమ పిల్లల మెడలలో వేస్తారనీ,

అట్లా వేస్తే వారు ఆరోగ్యంగా వుంటారని నమ్ముతారనీ కూడా ఆయన వ్రాశాడు.'' అంటూ రాక్స్‌బర్గ్ తన "ఫ్లోరా ఇండికా'' (1832) లో చెప్పాడు.

'రాక్స్ బర్గె' అన్నది కలకత్తా బొటానికల్ గార్డెన్స్ యొక్క మొదటి సూపరింటెండెంట్ అయిన విలియం రాక్స్‌బర్గ్ గౌరవార్థం పెట్టినపేరు.

## వ్యాప్తి

దిగువ హిమాలయ ప్రాంతంనుండి ద్వీపకల్ప ప్రాంతందాక యావద్భారతమువందూ, సింహళమునందూ పుత్రజీవిక వ్యాప్తి చెందింది. పడమటి కనుమల కొన్ని ప్రాంతాలలో మరీ అధిక సంఖ్యలో కాకపోయినా, ఎక్కువగానే కనపడుతుంది. భారతదేశంలో చాలచోట్ల వీధులప్రక్కల పెంచబడుతూంది. కలకత్తాలోని బొటానికల్ గార్డెన్స్‌లో పుత్రజీవికచెట్ల వరుసవున్న బాట చాల సుందరంగా వుంటుంది.

## వర్ణన

అనుకూల పరిస్థితులలో పుత్రజీవిక నిటారుగా 25 మీటర్ల ఎత్తుదాక పెరుగుతుంది. దీని కుంభం (గుబురు) బాగా విస్తరించి వుంటుంది. లేత కొమ్మలమీద నూగుంటుంది, కాని మిగతా చెట్టంతా రోమహీనమై నున్నగా వుంటుంది. ఆకు తోలువలె, తళతళలాడుతుంటుంది; బల్లెపు మొన ఆకారంలో, అంచున నొక్కులతో లేతాకుపచ్చ రంగులో వుంటుంది. ముదురాకుల రంగు ముదిరి, మెరుపు హెచ్చుతుంది. దీని పువ్వులు చాల చిన్నవి. ఏక లింగకములు (అనగా ఆడ, మగ పుష్పాలు వేర్వేరు చెట్లపై వుంటాయి.) ఇవి పసుపు రంగులో వుంటాయి. కాని పువ్వులు మరీ చిన్నవి కావడంవలన ఈ రంగు దృష్టి నాకర్షించదు. దీని పండు లోపల గట్టి గింజ వుంటుంది. పండు అండాకారంలో 15-20 మిల్లీమీటర్ల పొడవున వుంటుంది. దీని చెక్క గట్టిగా వుంటుంది; దీనిని వడ్రంగపు పనులకు వాడుతారు.

## ఉపయోగములు

చక్కని నీడనిచ్చే ఈ చెట్టును మన దేశమంతటనూ, ఇతర ఉష్ణమండల ప్రాంతాలలోనూ వీధుల ప్రక్కల పెంచుతారు. దీని ఆకులను జలుబు, రొంపకు

మందుగా వాడుతారు. పుత్రజీవిక విత్తనాలనుండి తీసిన నూనె దీపాలకు వాడుతారు. ఆకుల నప్పుడప్పుడూ పశుగ్రాసంగా వాడుతారు.

ఇది పిల్లలకు 'దిష్టి' తగలకుండా కాపాడుతుందని నమ్ముతారు. దీని కాయలతో చేసిన మాలలను పకీర్లు, పిల్లలు ధరిస్తారు. ఈ మాలలు ధరించిన వారి కెట్టి కీడూ కలగదని విశ్వసిస్తారు. ఇది నిజమైనా కాకపోయినా పుత్రజీవిక చాల అందమైన చెట్టు. ఇది వేసవిలో చల్లటి నీడనిస్తుంది.

## 31. బూసి

*SCHLEICHERA OLEOSA* (Lour) Oken.

(*Family*: Sapindaceae).

ఆంగ్లము పేర్లు: **KUSIM; GUMLAC TREE; HONEY TREE.**

బూసికి అనేక నామాంతరాలున్నాయి. అవి పోసుకు, పుష్క, కాగదెపోసుకు, కుసుమ, కోసెంగి, పుల్లకాయ, పాపత్రి, రోతంగ, పులుసురామరాజాతి, కొరలిపులుసు, మడకపులుసు లక్కచెట్టు, మావిటవిటికి.

'ష్లీషిరా' అన్న గణనామము జె. సి. ష్లీషర్ అన్న స్విస్ వృక్షశాస్త్రజ్ఞుడి జ్ఞాపకార్థం నిర్ణయించబడింది. 'ఓలియోసా' అనగా 'నూనెకలది' అని అర్థం: ఇది బూసి విత్తనాలనుండి తీసే నూనెనుబట్టి వచ్చినది. పాత పుస్తకాలలో బూసిని 'Schleichera trijuga willd' అన్న శాస్త్రీయనామంతో వ్యవహరించేవారు. 'త్రిజుగా' అనగా మూడు జతలు అని అర్థం; ఇది దీని ఆకులోని మూడు జతల ఉపదళాలను సూచిస్తుంది.

### వ్యాప్తి

బూసి హిమాలయ పాదశ్రేణినుండి దక్షిణాన సింహళందాక వ్యాపించివుంది. పశ్చిమకనుమలలో ఇది అధికంగా కానవస్తుంది. మధ్య భారతదేశమందలి




పటము 24. ఝాని

ఆకురాల్చు చెట్లకూడా వున్న అడవులలో, తూర్పున బర్మానుండి జావా టిమోకం దాక బూసి పెరుగుతుంది. మనదేశపు అడవులు చాల వాటిలో బూసి ఒక ముఖ్యమైన చెట్టు. దీని లేతాకులు మెరుస్తున్న ఎరుపు రంగులో వుంటాయి; ఆకారణం చేత ఇవి ఏ అడవిలోనయినా సరే చూపరుల దృష్టి నిట్టే ఆకట్టుకుంటుంది. ముదురాకులు ధూమ్రవర్ణంలోకి మారి, చివరకు ఆకుపచ్చగా అవుతాయి. డిసెంబరులో ఆకులు పసుపుబారి రాలిపోతాయి. ముఖ్యంగా మధ్య భారతదేశంలో దీనిని వీధుల ప్రక్కల నాటుతారు.

## వర్ణన

10-15 మీటర్లు లేక అంతకన్న ఎక్కువ ఎత్తుకు పెరిగే ఈ చెట్టు ఆకులు రాలుస్తుంది. ఆకు భిన్నపత్రముగా వుంటుంది. ప్రధానవృంతాని కిటూ అటూ 2-4 జతల ఉపదళాలుంటాయి. ఉపదళాలు పొడవుగా సాగివుంటాయి. క్రింది జత చిన్నదిగా, పై జత అంతకు రెండు లేక మూడురెట్లు పెద్దదిగా వుంటాయి. పసుపుపువ్వులు కొమ్మలచివర ఆకుల పంగలలో అనేక నిడివి కంకులలో పూస్తాయి. పండు సాగదీసినట్లు, గట్టిముళ్లతో వుంటుంది. పండులో పుచ్ఛములతో కప్పబడిన గింజలు 1-2 వుంటాయి.

## ఉపయోగములు

లక్కనిచ్చే భారతదేశపు చెట్లన్నిటిలో బూసి చాల ముఖ్యమైనది. దీనినుండి లభించే లక్కకు మంచి గిరాకీవుంది. బూసిచెక్క గట్టిగా వుంటుంది. మన్నుతుంది. ఈ చెక్కతో రోకళ్లు తయారుచేస్తారు. నూనె మిల్లులలో, పంచదార మిల్లులలో ఈ చెక్క నుపయోగిస్తారు. దీని విత్తనాలనుండి తీసిన నూనె వంటకు, సబ్బులతయారీకి, శిరోజాలంకరణకూ వాడుతారు. లేత బూసికాయలను ఊరబెడతారు. బూసిపండ్లలోని గింజలమీదవున్న తెల్లటి పదార్థం ఆమ్లరుచికలిగి, ఎండాకాలంలో తినడానికి చల్లగా బాగుంటుంది. లేతాకులూ, పువ్వులూ వేసవి ఆరంభంలో వస్తాయి. పూతమీద వున్న బూసిచెట్టును ఎన్నో పురుగులు, ముఖ్యంగా తేనెటీగలు ఆశ్రయిస్తాయి. అడవిలో నేను పరీక్షించి చూడగా 'ముళ్లు' వున్న

వండ్లలోపల ఖాళీగావుంది; అనగా గుజ్జును విత్తనాలతోసహా తినివేశాయన్న మాట. కనుక అసలు ఆ 'ముళ్ళ' వంటివి ఈ పురుగుల ఫలితంగానే ఏర్పడుతున్నాయి అని భావించవచ్చునేమో! ఫిబ్రవరి మార్చి నెలలలో బూరుగచెట్టు బూరుగుచెట్టంత అందంగా కనపడుతుంది. బూరుగచెట్టుకు పువ్వులు అందం.

## 32. బాండుగ

*SPATHODEA CAMPANULATA* Beauv.

***Family :*** Bignoniaceae

*ఇంగ్లీషు పేర్లు :* **THE TULIP TREE ; SCARLET-BELL ;**

**FOUNTAIN TREE ; SQUIRT TREE**

బాండుగకే పాతది, పాతదీవ, ఉద్ద, వోడి అన్న పేర్లున్నాయి. దీని ఇంగ్లీషు పేర్లన్నీ కూడా దీనియొక్క ఒక్కొక్క గుణాన్ని సూచిస్తాయి. దీని సింధూర వర్ణపు పువ్వులను బట్టి, వాటి ఆకారాన్నిబట్టి 'స్కార్లెట్ బెల్' అన్న పేరు వచ్చింది. దీని మొగ్గలను నొక్కితే వచ్చే నీటి ధారనుబట్టి "ఫౌంటెన్ ట్రీ" అనీ, "స్క్వర్ట్ ట్రీ" అనీ పిలువబడుతుంది. దీని పువ్వులకూ అసలు 'టులిప్' పువ్వులకూ వున్న పోలికలనుబట్టి - దీనికి "టులిప్ ట్రీ" అన్న నామము ఏర్పడింది.

దీని రక్షకపత్రావళి గరిటవలె వుండడంబట్టి 'స్పేథోడియా' అన్న పేరు, దీని పువ్వుల ఆకారంబట్టి 'కంపాన్యులాటా' (గంటను పోలింది) అన్న పేరు వచ్చాయి.

బాండుగ మన దేశంలోకి ఎప్పుడు వచ్చినదీ స్పష్టంగా తెలియదు. కాని అది ఆఫ్రికాలోని అంగోలానుండి సింహళానికి 1873 లో వచ్చింది. ఆ తర్వాతనే

బాండుగ మన దేశంలోకి వచ్చివుండాలి. ఆఫ్రికాకు చెందిన బాండుగ ఇప్పుడు ప్రపంచమంతా వ్యాప్తి చెందింది. గత శతాబ్దంలో మన దేశంలోకి ప్రవేశపెట్టిన అందమైన చెట్లలో బాండుగ ఒకటి. బాండుగ 'బిగ్నోని యేసీ' కుటుంబానికి చెందినది; ఈ కుటుంబానికి చెందిన ఎన్నో చెట్లు, తీగలు, అత్యాకర్షణీయంగా వుంటాయి. అయితే, బాండుగ పూనా, బెంగుళూరు వంటి 'పొడి' వాతావరణం గల నగరాలలో విరియబూచినంతగా బొంబాయివంటి కోస్తా ప్రాంత నగరాలలో పూయదు. పూనా, బెంగుళూరు మొదలైన నగరాలలో బాండుగను వీధుల ప్రక్కల విరివిగా నాటుతారు. విటారైన ఈ చెట్టు పైభాగమంతా ఎన్నో నెలల బాటు పువ్వులతో నిండి కళకళలాడుతూ వుంటుంది.

## వర్ణన

బొంబాయిలో మాత్రం బాండుగ సతతహరితంగా వుంటుంది. ఆర్ద్రత తక్కువగా గల ప్రాంతాలలో ఇది వేసవిలో కొన్ని రోజులపాటు ఆకులన్నీ రాల్చి బోసిగా వుంటుంది. దీని చెక్క మెత్తటి దవుటచేత పెద్దగా గాలి వీస్తే ఇది పడిపోగలదు. బాండుగది భిన్నపత్రము. ఈ భిన్న పత్రపు ఉపదళాలు చూడడానికి ఆకులవలె వుంటాయి; ముదురాకు పచ్చరంగులో వుంటాయి. ఈ కారణంచేత పూతలేని బాండుగచెట్టు చూడడానికి మందకొడిగా వుంటుంది. ప్రతి భిన్నపత్రంలోనూ 4-8 జతల ఉపదళములూ, చివర ఒక ఉపదళమూ వుంటాయి. ఆకులు ఎదురెదురుగా వుంటాయి. ఆకు తొడిమెల మొదళ్ల వద్ద గ్రంథులుంటాయి. శీతాకాలంలో పూల మొగ్గలు వస్తాయి. ఇవి చూడచక్కని ఆలివ్ ఆకుపచ్చ (పసుపు నలుపు కలిపిన) రంగులో ముఖ్మల్‌వలె మెత్తగా వుంటాయి. ఈ మొగ్గలు కొమ్మల చివర గుత్తులు గుత్తులుగా వస్తాయి. గుత్తిలో వెలుపల వున్న మొగ్గలు పెద్దవిగా, లోపలివి చిన్నవిగా—ఈవిధంగా ఈ మొగ్గలు వివిధ దశలలో వివిధ పరిమాణాలలో వుంటాయి. ఇట్లా ప్రతికొమ్మ శిఖరాన మొగ్గలు విరివిగా వుండడంవలన చెట్టుమీద పువ్వులు చాలకాలం నిలిచి వుంటాయి.

రక్షక పత్రావళి ఆలివ్ ఆకుపచ్చరంగులో వుంటుంది. రక్షక పత్రాలొండొంటి మధ్య, వాటి అంచులందూ స్ఫుటంగావున్న రేఖలనుబట్టి వాటిని విడివిడిగా



పటము. 25. బాండుగ

(చూడు : పుట 107)

పోల్చుకోవటంపించేగాని చూడడానికి అవన్నీ కలిసిపోయి వుంటాయి. ఆకర్షక పత్రాలూ ఇట్లాగే ఒకదానితో ఒకటి కలిపి పైచివరమాత్రమే విడివిడిగా వుంటాయి. ఆకర్షక పత్రావళిక్రింద గొట్టంలావుంది. దానిపైన కాస్త వంకరగా వున్న గంట ఆకారంలో వుంటుంది. రక్షక పత్రావళి పై అంచు నున్నగాగాని నొక్కులతోగాని వుంటుంది.

మొత్తం పువ్వంతా కలిపి ముద్ద సింధూరపు రంగులో వుంటుంది. జాగ్రత్తగా చూస్తే పువ్వు దిగువభాగం లేత నారింజ ఎరుపురంగులో, మధ్యభాగమంతా సింధూరవర్ణంలో, పై అంచు పసుపురంగులో వుంటాయి. కేసరములు నాలుగు వుంటాయి ఇవి ఆకర్షక పత్రావళి అంచునుండి బయలుదేపతున్నట్లున్న లావాటి పోగులమీద వుంటాయి. కీలమూ లావుగా, రక్షకపత్రావళికన్న పొడుగ్గా వుంటుంది.

దాని స్వదేశంలోను, మనదేశపు ఉష్ణప్రాంతాలలోను బాందుగచెట్టు కాయలు కాస్తుంది. ఈ కాయ గట్టిగా, కూచిగా, పొడుగ్గా వుంటుంది. కాయలోపల రెక్కలున్న గింజలు చాల వుంటాయి. కాని బొంబాయిలో నేనెప్పుడూ ఈ కాయలను చూడలేదు. ఇట్లా కొన్నిచోట్ల కాయలు కనపడకపోవడంవలన దీని పెంపకం ఒక సమస్యగా తయారవుతుంది. అయితే బాందుగచెట్టుకు బోలెడు వేరుపిలకలు పుడతాయి; ఈ వేరుపిలకలద్వారా దీని ప్రవర్ధనం కొనసాగిస్తారు.

## పూత

ఉష్ణమండల ప్రాంతమయిన ఆఫ్రికాలో బాందుగ సెప్టెంబరు-మే నెలల మధ్య పూస్తుంది. బొంబాయిలోనయితే శీతకాలమంతా ఇది పూతమీద వుంటుంది; వేసవి పూర్వభాగంలోనూ పువ్వులుంటాయి; ఒక్కొక్కసారి వానకాలం తర్వాత కూడా పువ్వులు కనుపిస్తాయి.

బాందుగ సముద్రమట్టానికి 1500 మీటర్ల ఎత్తువరకు పెరుగుతుంది. అయితే సముద్రమట్టాన బాగా పెరగుతుంది. వీధులవెంబడి పెంచడానికిది చాల అనువైనది. నీరు బాగా వడిపే నేలలో నాటినట్లయితే బాందుగ ఏపుగా పెరిగి శోభాయమానంగా వుంటుంది.

# 33. చింత

*TAMARINDUS INDICA* Linn.

*Family :* Caesalpiniaceae

ఆంగ్లపు పేరు : **THE TAMARIND TREE**

చింతను ఆంగ్లంలో 'టేమరింద్' అంటారు. ఈపదం 'తమార్-ఎ-హింద్' అన్న పర్షియన్ పేరుకు రూపాంతరము. ఆ పర్షియన్ పేరుకు 'భారతదేశపు ఖర్జూరము' అని భావము. 'ఇండికా' అన్న జాతి నామం ఈచెట్టు భారతదేశానికి చెందినదన్న వుద్దేశంలో పెట్టబడింది. కాని చింత ఆఫ్రికాకు చెందినదని ఇప్పుడు భావిస్తున్నారు. అయితే ఇప్పుడు చింత ఉష్ణమండల దేశాలు పెక్కింట పెరుగుతుంది.

## వర్ణన

సతత హరితమైన చింతచెట్టు అందంగా వుంటుంది; పెద్దగా పెరుగుతుంది. చిన్నప్పుడు చింతమ్రాను ఏటారుగా సూద చక్కగా వుంటుంది. అయితే సాధారణంగా అశ్రద్ధ కారణంగా పెరిగినకొద్దీ వంకర టింకరగా, లావుగా వికారంగా పెరుగుతుంది. చింతయొక్క భిన్నపత్రంలో అనేక ఉపదళాలుంటాయి. చింత శాఖోపశాఖలుగా విస్తరిల్లి ఏపుగా పెరిగి దట్టమైన, ఆహ్లాదకరమైన నీడనిస్తుంది. లేతాకులు ఆకుపచ్చగా మెరుస్తున్నట్లుంటాయి. ముదిరాక వీటి మెరుపు తగ్గుతుంది కాని చూడడానికి బాగుంటాయి. పువ్వులు చిన్నవిగా వుంటాయి. ఇవి వదులుగా వున్న గుత్తులలో పూస్తాయి. ఈ గుత్తులు ఆకులలో కలిసిపోయి వుంటాయి. ఆకర్షకపత్రాలు పసుపు ఎరుపురంగులలో వుంటాయి. ఆకర్షకపత్రాలు మూడు మామూలుగా వుంటాయి; రెండేమో సన్నగా పోగుల్లా వుంటాయి. చింతచెట్టు విపరీతంగా పూస్తుంది. పూతకాలంలో చెట్టుక్రిందంతా పువ్వుల రేకులతో కప్పబడి వుంటుంది. చింతకాయ వంకరగా, ఎగుడుదిగుడుగా ఉబ్బివుంటుంది, గోధుమ




పటము 28.    చింత

రంగులో వున్న ఈకాయలో పీచుగా వున్న గుజ్జు. గుజ్జు మధ్య గింజలూ వుంటాయి.

## వ్యాప్తి : ఉపయోగములు

అబిసీనియా, మధ్య ఆఫ్రికాలనుంచి చింత మనదేశానికి వచ్చింది. అయితే ఈ రావడం అన్నది చాలా శతాబ్దాలక్రింద జరిగింది. కనుకనే మనకు ఈ విషయాన్ని గురించిన సాక్ష్యాధారాలేమీ లేవు: వీధులవెంబడి చింతచెట్లను పెంచుతారు. అడవులలో చిన్నచిన్న చింతతోపులు కనుపిస్తాయి. కాని అట్లా వన్యస్థితిలో వున్న చింతచెట్లను చూచి, చింత మనదేశానికి చెందినదని భ్రమ పడరాదు. మామూలుగా పాడుపడిన, నిర్జనమైన గ్రామాలే చింతతోపులుగా తయారవుతాయి. చింత మన దేశమంతటా పెరుగుతుంది; అయితే ఉత్తరాదిన పంజాబులోను చింత చెట్టు పూయదు; కాయదు.

చింతాకులలో ఆమ్లంపాలు ఎక్కువ; ఆ కారణంచేత సాధారణంగా చింతచెట్టు నీడకు ఏమొక్కలూ పెరగవు; ఇందువలన చింతచెట్టు చాల చెడ్డదన్న నమ్మకం కొన్నిప్రాంతాలలో వుంది. చింతచెట్టుమీద దెయ్యాలూ అవీ నివసిస్తాయనీ, చింత చెట్టుక్రింద నివసించేవారిని అవి పీడిస్తాయనీ భయపడుతారు. అందుచేత చింత చెట్టుక్రింద పండుకోరు.

వీధులప్రక్కన చింతచెట్లు అందంగా వుంటాయి. తమిళ్‌నాడులో, ముఖ్యంగా కోయంబత్తూర్ ప్రాంతంలో చింతచెట్లు వరుసలున్న రోడ్లు ఎన్నో వున్నాయి. ఇట్టి రోడ్లన్నీ చూడడానికి బాగుంటాయి. చింతకర్ర చాల గట్టిగా వుంటుంది. దీనితో రోకళ్లు మొదలైనవి చేస్తారు. చింతపండును వంటలో వాడుతారు. దీనికి బాగా గిరాకీవుంది. ఇది పుల్లగా వుంటుంది. కరువుకాలంలో చింతగింజలను తింటారు. చింతగింజలను పొడిచేసి, బంకతోబాటు కలిపి వుడికించితే, అది కర్రను అతికించడానికి పనికివస్తుందంటారు. చింతచిగురుని వంటలో ఉపయోగిస్తారు. చింతచెట్టులోని వివిధ భాగాలకు ఔషధీ గుణాలున్నాయంటారు.

నేను యువకుడిగా వుండగా భారతదేశానికి వచ్చాను. నేను కొన్ని ఇత్తడితో చేసిన వాద్యాలను శుభ్రంచేయవలసిరాగా, అవని ఎట్లా చేయడమని ఓ మిత్రుడిని

అడిగాను. అతడు వంటవాడినుండి చింతపండు పిప్పిని తీసుకుని, దానితో ఆ వాద్యాలను రుద్ది, కడిగి, ఆరబెట్టమని చెప్పాడు. నేను అట్లా చేశాను. ఆ ఇత్తడి వాద్యాలు తళతళ మెరవసాగాయి. అప్పుడు నేను వంటవాడికి చింతపండుతో పనేమిటని అడిగాను; చింతపండు వంటలోకి పనికివస్తుందని చెప్పాడు. చింతపండు కలిపిన వంటకాలను తినేవారి నోరూ, అన్నవాహికా, జీర్ణకోశమూ ఎంత తళతళలాడుతుంటాయో అనుకుని నవ్వుకున్నాను. ఆ తర్వాత క్రమంగా నేను ఆ వంటకాల రుచి నెరిగి వాటి విష్టంగా తినసాగాను.

1658 లో జాకోబ్ బోంటియస్ అన్నతడు జావాలోని మొక్కలగురించి వ్రాసిన పుస్తకంలో చింతపండు ఉపయోగంగురించి ఈవిధంగా వ్రాశాడు: "మేమిక్కడ రోజూ ఒక పానీయం త్రాగుతున్నాము. దానిని చింతపండు, పంచదారలతో తయారుచేస్తారు. ఒక పెద్ద పాత్రలో 30 'జగ్' ల నటినీరు పోస్తారు. ఆ నీటిలో 2 పౌండ్ల జావా నల్లచక్కెర, 2 ఔన్సుల చింతపండు, రెండు కోసిన నిమ్మపండ్లు వేస్తారు. వీటన్నిటిని బాగా పిసికి, కలయబెడతారు. అప్పుడా పాత్రను 24 గంటలసేపు నీడలో వుంచుతారు. అప్పుడు ఇవన్నీ కలిసి ఆపాత్రలో పులిసి, కుతకుత వుడుకుతాయి। ఈ పాత్రను పొయ్యిమీద కెక్కించితే అప్పుడు మడ్డి అంతా పైకి తేలుతుంది. ఈ పానీయం చాల రుచికరంగా, డచ్చిబీర్‌వలె వుంటుంది. ఈ వేడిదేశంలో ఈ పానీయం ఆరోగ్యానికి చాల మంచిది. నన్ను గనుక డచ్చిబీరా, ఈ పానీయమా అని అడిగితే ఈ పానీయమే ఇమ్మంటాను."

# 34. టేకు

*TECTONA GRANDIS* Linn F.

***Family :*** Verbenaceae

ఇంగ్లీషు పేరు : **THE TEAK TREE**

టేకుయొక్క శాస్త్రీయ నామమైన 'టెక్టోనా గ్రాండిస్' అన్నదానిలోని-'టెక్టోనా' గ్రీకు పదమైన 'టెక్టాన్' (వడ్రంగి) నుండి వచ్చినదని బెంథాల్ అంటాడు. 'గ్రాండిస్' అనగా 'పెద్దది' అని తాత్పర్యము. ఇది టేకు చెట్టుయొక్క పరిమాణాన్ని సూచిస్తుంది.

## వ్యాప్తి

భారతదేశము, బర్మా-జావాలు, వాటి మధ్యవున్న ప్రాంతాలు—ఇవి టేకు చెట్టు యొక్క జన్మస్థలాలు. భారతదేశంలో ఉత్తరాదిని రాజస్థాన్‌లోని ఆరావళీ కొండల నుండి తూర్పున ఝాన్సీ జిల్లా దాకాను, ఆగ్నేయదిశను మహానది దాకాను ఒక గీత గీస్తే ఆ గీతకు దక్షిణానే టేకు పెరుగుతుంది. ఇది ప్రకృతి సిద్ధమైన సరిహద్దు. టేకు 1680 లో సింహళంలోకి ప్రవేశించింది. సౌరాష్ట్రలోని గిర్ అడవులలో టేకు చాలకాలంనుండి పెంచబడుతుంది. బర్మా టేకును ఉత్తమమైనదానిగా పరిగణిస్తారు. మనదేశంలో ఉత్తర కనరానుండి, డాంగ్స్ అడవులనుండి మేలిరకపు టేకు లభ్యమవుతుంది. అక్కడక్కడా నగర వీధులలో టేకు కనబడుతుంది. కాని వేసవిలో ఆకులు లేకుండా, చూడడానికి కూడా వికృతంగా వుంటుందన్న కారణంచేత టేకు చెట్లను సాధారణంగా బాటల ప్రక్కన పెంచరు.

## వర్ణన

టేకుచెట్టు ఆకురాల్పుజాతికి చెందినది. ఇది చాల ఎత్తుగా పెరుగుతుంది. డాంగ్స్, ఉత్తర కనరాలలో 30 మీటర్ల ఎత్తుకు పెరిగిన టేకుచెట్లను వేసవి




పటము 27. టేకు

చూచాను. భారతదేశంలో కొన్నిచోట్ల, బర్మాలోను 60 మీటర్లు లేక అంతకన్న ఎక్కువ ఎత్తుకు టేకుచెట్లు పెరిగిన సందర్భాలున్నాయి. లేతకొమ్మలు చచ్చౌకముగా (నాలుగు పలకలుగా) నూగు కలిగి వుంటాయి. ఆకులు ఎదురెదురుగా వుంటాయి. ఆకుల పొడవు 30-60 సెంటిమీటర్లు, వెడల్పు 15-30 సెంటిమీటర్లు వుంటాయి. చిన్నమొక్కల ఆకులయితే పెద్దవిగా, చిన్న గొడుగంత పరిమాణంలో వుంటాయి. కాయలు 15 మిల్లిమీటర్ల వెడల్పున మెత్తగా వుంటాయి. ఈ కాయమీద దాని పుష్పంయొక్క రక్షకపత్రావళి అట్లాగే వుంటుంది. ఆకులు గరుకుగా వుంటాయి. పైన నూగుండదు; దిగువ ఎర్రటి నూగుంటుంది. పువ్వులు కొమ్మలచివర వదులు గుత్తులుగా వస్తాయి. తెల్లటి ఈ పువ్వులు చిన్నవిగా 6 మిల్లిమీటర్ల వెడల్పున వుంటాయి. టేకుచెట్టు వర్షర్తువులో పూవులు పూస్తుంది; శీతాకాలంలో కాయలు కాస్తుంది. నవంబరు-జనవరి మాసాలమధ్య ఆకులు రాలిపోతాయి. వేసవి అంతా టేకుచెట్టు ఆకులు లేకుండా వుంటుంది. చెట్టు చిగురించడమూ, మొగ్గ తొడగడమూ ఒక్కసారే జరుగుతాయి. వర్షాకాలంలో పుష్పభరితమై టేకుచెట్టు నయనానందకరంగా వుంటుంది. ఆకులు రాల్చేముందుగా చూడడానికి వికృతంగా వుంటుంది.

## ఉపయోగములు

టేకును దాని కలపకోసమే పెంచుతారు. "భారతదేశపు కలపలన్నింటిలో టేకు ఉత్తమమైనది. ఓడలు నిర్మించడానికి టేకునుమించిన కలపలేదు. ఇండ్ల నిర్మాణానికి, వంతెనల నిర్మాణానికి, వాసములుగా వాడడానికీ, చక్రముల ఆకులు చట్రాలు, కుర్చీలు మేజాలు వంటివి చేయడానికీ—టేకు పనికివస్తుంది." అని ట్రూప్ వ్రాశాడు. టేకు బాగా మన్నుతుంది. ఇందుకు ఉదాహరణగా లొనావ్లా (మహారాష్ట్ర) లోని కర్లాగుహల కప్పు చుట్టూవున్న టేకు దూలాలను చెప్పవచ్చును. 2000 ఏండ్ల వయసుగల ఈ టేకు దూలాలు ఈనాటికీ చెక్కుచెదరకుండా నిలిచి వున్నాయి। టేకు కలపలోపల బెజ్జాలన్నీ ఒకవిధమైన బంక పదార్థంతో నిండి వుంటాయి. అందుచేత నీరు ఆ కలపలోపలికి పోయి, దానిని పాడుచేయలేదు. టేకుకు చెదపురుగులు పట్టవు.

పెంపకము

నీరు బాగా వడిసేటువంటి మంచినేలలో నారు మడిని సిద్ధంచేసి విత్తనాలు నాటాలి. సంవత్సరం తర్వాత వర్షాకాలారంభసమయంలో చేవ మొక్కలను నీడ తగలని బహిరంగప్రదేశంలో నాటాలి. చేవ చెట్లను ఎవరయినా తమ తమ తోటలలో పెంచినాసరే, ఆ చెట్లు ప్రభుత్వానికే చెందుతాయి అన్న చట్టం కారణంగా చేవను అనుకు ఎక్కువగా పెంచరు.

## 35. మునిగంగరావి

*THESPESIA POPULNEA* Soland

*Family* : malvaceae

ఆంగ్ల పేర్లు : THE BHENDI TREE; PORTIA TREE;

TULIP TREE; UMBRELLA TREE

మునిగంగరావినే గంగరావి, గంగరాయి, గంగరేణి మునిగంగరాయ — అన్న పేర్లతో కూడా పిలుస్తుంటారు.

మనదేశానికి చెందిన అతి చక్కని చెట్లలో మునిగంగరావి ఒక్కటి. కొంకణ సముద్రతీరప్రాంతంనుండి దక్షిణంగా బర్మా, పసిఫిక్ ద్వీపాలదాకాను, పడమట తూర్పు ఆఫ్రికావరకు మునిగంగరావి వ్యాప్తి చెందింది.

దీని శాస్త్రీయనామములోని 'థిస్పీసియా' అన్న గ్రీకు పదానికి 'దైవసంబంధమైన' అని భావము. కేప్టెన్ కుక్ దీనిని తహితిలో దేవాలయాల సమీపాన చూచినట్లు ఈపదం సూచిస్తుంది. యూరపుకుచెందిన 'పోప్లార్' చెట్టు ఆకులను పోలిన ఆకులను 'పాపుల్నియా' అన్నపదం సూచిస్తుంది.

## వర్ణన

ఇది చిన్న పరిమాణంనుండి మధ్య పరిమాణందాకా పెరుగుతుంది. మునిగంగ రావిచెట్టు నిటారుగా పెరుగుతుంది. దీని మ్రాను నిటారుగా వుంటుంది. దీని కొమ్మలు దగ్గర దగ్గరగా వుంటాయి; దీని కుంభము (గుబురు) దట్టంగా వుంటుంది. ఆ కారణంచేతనే దీనికి ఇంగ్లీషులో 'గొడుగుచెట్టు' అన్న పేరు వచ్చింది. బిరుసుగా వుండే దీని ఆకులు ఇంచుమించు హృదయాకారంలో వుంటాయి. ఇవి మరచుట్టు ప్రసారంలో వుంటాయి. ఆకు పొడవు 7-14 సెంటి మీటర్లుంటుంది. ఆకు చివర కొనదేలివుంటుంది. దీని ఆకు రావియాకును పోలి వుంటుంది కాని దీని ఆకు 'తోక' రావియాకు తోకంత స్ఫుటంగా వుండదు. మునిగంగరావి ఆకులను రాలుస్తుంది; కాని అన్ని ఆకులను ఒక్కసారే రాల్చదు. ఆ కారణంగా ఇది సతతహరితంగా వుంటుంది. ఫిబ్రవరి నెలపాటికి చాల ఆకులు పండబారి రాలిపోతాయి. దీని పసుపుపచ్చని పువ్వులు ఆకర్షవంతంగా వుంటాయి. పువ్వు 7-9 సెంటిమీటర్ల వెడల్పున వుంటుంది. పువ్వు లోపలి ధూమ్రవర్ణంలో 'కన్ను' వంటి మచ్చ వుంటుంది. పువ్వులు క్రమంగా ఇటుక ఎరుపురంగులోకి మారుతాయి. ఆకర్షకపత్రాల అంచులు ముడతలు పడివుంటాయి. కేసరములన్నీ కలిసి గొట్టంవలె ఏర్పడివుంటాయి. ఈ గొట్టం ఎరుపుగానో ధూమ్రవర్ణంలోనో వుంటుంది. పుప్పొడి తిత్తులు బంగారు వన్నెలో వుంటాయి. ఈ గొట్టంలోనుండి కీలము బయటికివచ్చి కొనను అయిదు కీలాగ్రములుగా చీలుతుంది. దీని కాయ గుండ్రంగా, గిన్నెవంటి రక్షక పత్రావళి మధ్య అమరివుంటుంది. పచ్చికాయ ఆకు పచ్చగా వుంటుంది. పండినకొద్దీ గోధుమరంగులోకి మారి. చివరకు నల్లబారు తుంది. ప్రతీ పండులోనూ సన్నటి నూగుకల, అండాకారపు విత్తనాలు 5-15 వుంటాయి.

## పూత

మునిగంగరావి సంవత్సరం పొడవునా పూస్తుంది. శీతాకాలంలో అధికంగా పూస్తుంది.

## పెంపకము

మునిగంగరావి కోస్తా ప్రాంతాలకు చెందినదయినప్పటికీ, ఇతర ప్రాంతాల లోనూ బాగానే పెరుగుతుంది. అందుకనే దానిని తోటలలోను, వీధుల ప్రక్కను పెంచుతారు. అందానికయితేనేమి, చల్లటి నీడకయితేనేమి పెంచదగిన చెట్టు— మునిగంగరావి. గుల్లగా వున్న తేలికనేలలు మునిగంగరావికి అనువైనవి. కను కనే అది సముద్రతీరపు ఇసుకనేలలలో బాగా పెరుగుతుంది. ఇది త్వరగా పెరుగు తుంది. విత్తనాలద్వారాగాని శాఖా ప్రవర్ధనంద్వారాగాని మునిగంగరావిని పెంచ వచ్చును. పెద్దగావుండే కాండపు లేదా కొమ్మల ముక్కలను నాటితే క్షీణించి పోతాయి; కనుక చిన్న ముక్కలను నాటడం మంచిది.

## ఉపయోగములు

మునిగంగరావిచెక్క నాణ్యమైనది; గట్టిగా వుంటుంది. సన్నటి కణములుగల ఈ చెక్క నీటివలన పాడవదు. దీనితో బండిచక్రాలూ, పెట్టెలూ, పడవలూ చేస్తారు. ఇతర దేశాలలో దీని బెరడునుండి లభించే సన్నటినారను మనదేశంలో జనపనార నుపయోగించినట్లే ఉపయోగిస్తారు; దానితో గోతాంసంచులూ త్రాడూ చేస్తారు. మనదేశంలోమాత్రం ఈ నారను ఎక్కువగా ఉపయోగించరు. ఈ చెట్టు యొక్క వివిధభాగాలనుండి. ముఖ్యంగా అడుగుమ్రానునుండి, కొమ్మలనుండి టానిన్, ఎర్రటిరంగు పదార్థమూ లభిస్తాయి. కాని మనదేశంలో వీటి నుపయో గించడంలేదు.

## ఓషధీగుణాలు

మునిగంగరావి పండ్లను, ఆకులను, వేళ్లను ముద్దగానూరి పూస్తే కొన్ని చర్మవ్యాధులు నయమవుతాయంటారు. మరి, ఇదెంతమాత్రం నిజమో నాకు తెలి యదు. దాని బెరడును విరేచనాలు కట్టడానికి ఇస్తారు.

అయితే వీధులప్రక్కల నాటడాని కిది చాల అనువైనచెట్టు. అందుకనే ప్రపం చంలోని చాల ఉష్ణమండలపు దేశాలలో మునిగంగరావి చోటు నంపాదించుకుంది.

# 36. నంది

*TOONA CILIATA* Roem

*Family :* Meliaceae

ఇంగ్లీషు పేరు : THE TOON TREE

నందిచెట్టుకే గాలిచెట్టు అన్న పేరూ వుంది. నందికి సంస్కృతంలో 'తున్న' అన్న పేరుంది. చాల భారతీయ భాషలలోను దీనికి 'తున్న' 'తూను' 'తున్నం' 'తున్‌దు' అన్న పేర్లున్నాయి. వీటినుండే దీని లాటిన్ పేరయిన 'టూనా' పుట్టింది. నందిపువ్వుయొక్క ఆకర్షక పత్రాలమీద, రక్షక పత్రాలమీద వున్న లావాటి రోమములను సూచించే పదము—'సీలియాటా'.

నందిచెట్టునే 'Cedrela toona' అన్న శాస్త్రీయనామంతో వ్యవహరించడమూ కద్దు. అయితే ఇది సరికాదు. అసలైన 'సెడ్రిలా' చెట్లన్నీ కూడా అమెరికాకు చెందినవి అని 1846 లో రోమర్ నిర్ధారణచేశారు; తదనంతరం ప్రాగ్దేశాల చెట్లన్నిటినీ 'టూనా' నామంతో వ్యవహరించ సాగారు.

## వర్ణన

ఇది అందమైన పొడుగాటి చెట్టు. గుబురుగా పెరిగి దట్టమైన నీడనిస్తుంది. దీని పక్షాకారపత్రం మధ్య గట్టిదైన ప్రధాన వృంతం వుంటుంది. ఈ ప్రధాన వృంతానికటూ ఇటూ జతలు జతలుగా ఉపదళాలుంటాయి. రెమ్మలచివర వాలిన గుత్తులలో పువ్వులు పూస్తాయి. పువ్వులు సువాసనగా వుంటాయి. నారింజ ఎరుపురంగులో వున్న పళ్ళెంవంటి దానిమీద కేసరములుంటాయి. కాయలు 2-2·5 సెంటీమీటర్ల పొడవున, నిడివివాటంగా వుంటాయి. ఇవి బహు విదారక ఫలములు. వీటిలో చదునుగా వున్న గింజలు ఎన్నో వుంటాయి. ఈ గింజయొక్క రెండు కొనలందూ రెండు పొరలవంటి రెక్కలుంటాయి.




పటము 28. నంది

## వ్యాప్తి

నంది మన దేశమంతటా కనపడుతుంది: ముఖ్యంగా కొండప్రాంతాలలో, సముద్రమట్టంనుండి 1000 మీటర్ల ఎత్తువరకు నంది పెరుగుతుంటుంది. నీడ నిమిత్తం దీనిని వీధుల ప్రక్కల నాటుతారు. ఉత్తరకనరాలో నంది ఎక్కువగా కనపడుతుంది; అక్కడ ఇది 30 మీటర్లకన్న (100 అడుగులు) ఎక్కువ ఎత్తుకు పెరుగుతుందట. మనదేశానికి తూర్పున మలయా, ఆస్ట్రేలియాదాక నంది వ్యాపించింది.

### ఉపయోగములు

నందివలె బహుళోపయోగకరమైన చెట్లు అరుదుగా వుంటాయి. దీని చెక్క ఎర్రగా, సువాసనగా వుంటుంది. దీనికి చెదలు పట్టవు. దీనిని నిర్మాణపు పనుల లోను, మేజాలు మున్నగు వాటిని తయారుచేయడానికిని, ఉపయోగిస్తారు. చుట్టలు పెట్టుకునే పెట్టెల నెక్కువగా ఈ చెక్కతోనే చేస్తారు. దీని పువ్వులనుండి పసుపు, ఎరుపు అద్దకపు రంగు ద్రవ్యం లభిస్తుంది. కాని ఇది నిలిచివుండే రంగు కాదు కనుక దీనికి వాణిజ్యపువిలువ లేదు. నంది విత్తనాలను ఆకులనూ పశువు లకు మేతగా పెడతారు. నంది బెరడుకు విరేచనాలు మున్నగు వాటిని కట్టేగుణం వుందంటారు.

# పారిభాషిక పదావళి

Alae - పక్షదళములు
Alternate arrangement - మరచుట్టు ప్రసారము (ఏకాంతరక్రమము)
Anther - పుప్పొడితిత్తి
Aril - పుచ్ఛము
Axil - చంక
Barren - గొడ్డుబోతైన
Berry - మృదుఫలము
Bipinnate leaf - ద్విభిన్న పక్షాకార పత్రము
Bole - అడుగుమొద్దు
Bracts - చేటికలు
Calycine leaf - కవంటి అరక్షక దళము
Calyx - రక్షకపత్రావళి
Capsule - బహువిదారణఫలము
Compound leaf - భిన్నపత్రము
Concave - పుటాకారముగా (పల్లముగా) నున్న
Corolla - ఆకర్షక పత్రావళి
Corymb - కురుచగెల
Crenate - వలయదంతగరి
Crisped - నొక్కులుగల
Crown - కుంభము (గుబురు)
Cultivation - పెంపకము (సాగుబడి)
Cutting - కాండపు ముక్క; కొమ్మ ముక్క
Deciduous - ఆకురాల్చు
Dentate - దంతగరి
Distribution - వ్యాప్తి
Downy - నూగుగల (రోమయుతము)
Drupe - టెంకకాయ
Dry fruit - ఎండుకాయ (పండు)
Elliptic - అండాకారపు
Entire - సమాంచలము
Family - కుటుంబము
Fascicle - గుత్తి
Fertile - సంపర్కయోగ్యమైన; సారవంతమైన
Fig - పుష్పపీఠము; సంయుక్తఫలము
Filament - పోగు
Fleshy fruit - కండకాయ (పండు)
Flower ball - పూబంతి
Follicle - ఏకవిదారణఫలము
Fungus - బూజు
Genus - గణము
Generic name - గణనామము
Glabrous - నూగులేకుండా (రోమహీనముగా)
Hair - నూగు (రోమములు, వెంట్రుకలు)
Hook worm - నులిపురుగు
Imparipinnate leaf - విషమ భిన్న పత్రము
Indehiscent - అవిదారణఫలము
Inflorescence - మంజరి
Irregularly toothed - అక్రమమైన గరిలో
Lanceolate - బల్లెపు ఆకారపు
Layer - అంటు
Leaflet - ఉపదళము
Legume - ద్వివిదారణఫలము
Littoral - సముద్రతీరప్రాంతపు
Lobe - తమ్మె
Mealy - పిండి
Midrib - మధ్య ఈనె

